శ్రీరస్తు

శ్రీ మత్పురాభట్టారికాయై నమః

# - తారకమ్ -

బ్రహ్మశ్రీ శ్రీ మదజ్జాడాదిభట్ట నారాయణదాస
మహాకవి విరచితమ్

(సవ్యాఖ్యానమ్)

★ భావార్థదీపికా ★


వ్యాఖ్యాతా
బ్రాహ్మీ భూషణ
రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి
విశాఖపత్తనమ్.

దాస భారతీ ప్రచురణలు-21

సంస్కృత కవిత్వం

ప్రొఫెసర్ గెల్డ్‌నర్ మార్ట్సుబర్గు యూనివర్శిటీవారు శ్రీ నారాయణ దాసవర్యుల తారకగ్రంథముపై పంపించిన అభిప్రాయముకూడ ఇందు పొందుబరచబడినది.

జానాతే యన్న చంద్రార్కౌ జానతే యన్నయోగినః
జానీతే యన్న భర్గోఽపి తజ్జానాతి కవిః స్వయం.

వచః సుధామయం కావ్యం పీత్వాహం తృప్తమానసః
కృతజ్ఞః అభిప్రశంసామి భవంతం కవిశేఖరమ్.

Year
1929

Prof. GELDNER
Marts Burg University.
West Germany.

జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్
అరండల్ పేట, 7వ లైను,
గుంటూరు - 2.

# భూమిక

సంగీతసాహిత్యములు రెండింటిని సమానస్థాయిలో సంతరించుకొని సాక్షాత్కరించిన సరస్వతియే శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణదాస మహాశయుడు. వైణికశ్రేష్ఠునిగా, లయబ్రహ్మగా, హరికథాపితామహునిగా లోకమాతని గూర్చి బహుధా శ్లాఘించినది. కాని ఆతడు మహాపండితుడు మహాకవి. ఆశుకవి. అష్టావధాని, అనన్యసామాన్య వచోవిలాస సంతోషిత ప్రజానీకుడు. బహుభాషావేత్త.

ఈ మహాకవి పెక్కుగ్రంథములను ఆంధ్రములో సంస్కృతములోను రచించెను. అముద్రితములైన యాగ్రంథములను సంపాదించి, సవరించి, ముద్రింపజేసి పాఠకలోకమున కందించితిని. ఆతని కృతులయిన కాశీ రామచంద్రశతకములు గూడ ఆంధ్రములోని కనువదింపబడినవి. పారశీకభాషనుండి సంస్కృతములోని కనువదింపబడిన "ఉమర్ ఖయ్యాం" అనుదానినే ఆమహాకవియే నాటు తెనుగున ననువదించిరి. ఇంతవరకాతని గ్రంథము లేదోవిధముగ పాఠకలోకమున కందినవి. కాని "సంస్కృతభాషలో రచింపబడిన "తారక"మను మహాకావ్యముమాత్రము అట్లేయుండిపోయినది. మూలగ్రంథమును తెలుగు లిపిలోనికి ముద్రించినంతమాత్రమున ప్రయోజనము కానరాలేదు. అనల్పకల్పనలతో, అపూర్వపదప్రయోగములతో అతిమనోహరముగ రచింపబడిన ఆమహాకావ్యమునకు వివరణగావించి ముద్రించుట ఆవశ్యకమనిపించినది. సర్వసమర్థుడైన సంస్కృతపండితుడు తక్క మరియొకరా పనిని నెరవేర్పజాలరు. ఎవ్వరు లభింతురాయని నిరీక్షించుచుండ బ్రహ్మభూషణ శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారు నాకంటబడిరి. ఈమహాకార్యభారమును వహింపుడని వారినర్థించితిని. దానికి వారంగీకరించి, రెండుమూడుసార్లు గ్రంథమును జదివి, కవిహృదయము నాకళించుకొని ఆశ్చర్యపరవశులై, "వ్రాసిన యిట్టి మహాకావ్యమునకు వ్యాఖ్యానము రచింపవలెను. సామాన్యగ్రంథములకు వ్యాఖ్యయేల కించిత్కరము" అని భావించి సంస్కృతములోనే వ్యాఖ్యానమును రచించిరి.

అంతనాగక ప్రతిశ్లోకమునకు తెనుగున తాత్పర్యముగూడ వ్రాసి యచిరకాలములోనే నాకందించిరి. నా మనోరథము నెరవేరినదని సంతసించితిని. వ్రాతప్రతి నెలరోజులలోనే నాకందచేసిరి.

పిమ్మట, దీనిని 'కళాప్రపూర్ణ'-విద్వత్కవి శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారి కిచ్చి, దీనిపై వారియభిప్రాయమునడిగితిని. వారుకూడ పరమానందభరితులై మంచియభిప్రాయమును వ్రాసిరి. పిమ్మట "వ్యాకరణ సార్వభౌమ శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రిగారికి, "వ్యాకరణాలంకారచక్రవర్తి"-శ్రీ అప్పల సోమేశ్వరశర్మగారికి, "సాహిత్యాలంకార"-శ్రీమాన్-కోగంటి సీతారామాచార్యులవారికి నందించితిని. వారుకూడ మిక్కిలి సంతోషముతో మంచి అభిప్రాయముల నిచ్చిరి.

ఇట్లు, దాససాహితిని పరిపూర్తిగావించితి. ఇదియే చివరిగ్రంథము, చివరిదైనను అన్నింటికంటె ముందుదనియే చెప్పవచ్చును.

సకల జగత్ప్రసిద్ధుడైన ఆ మహాత్మునికి ఈ మాత్రపు సేవ గావించితిని, నాజీవితము సార్థకమైనదని భావింతును.

ఇట్లు; గ్రంథమునకు వ్యాఖ్యానము వ్రాసిన బ్రాహ్మీభూషణులకు, దీనిపై సదభిప్రాయముల నొసంగిన, కళాప్రపూర్ణులకు, వ్యాకరణసార్వభౌములకు, వ్యాకరణాలంకార చక్రవర్తులకు సాహిత్యాలంకారులకు నాహృదయపూర్వక నమోవాకములు.

ఇట్టి బృహద్గ్రంథమును ముద్రించుటకై తగిన ఆర్థికసహాయము నందించిన శ్రీశ్రీశ్రీ తిరుపతి దేవస్థానములవారికి నామనఃపూర్వక నమస్సుమాంజలులు. దాసభారతీ ప్రచురణలకు సహకరించిన శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణరావుగారు కూడ అభినందనీయులు.

గుంటూరు
1-10-87

ఇట్లు
కర్రా ఈశ్వరరావు
దాసభారతీ ప్రచురణకర్త.

# - ప్రతిజ్ఞా -



అస్మిన్గ్రన్థే శ్లోకేషు పాదపూరణమాత్ర ఫలకపద ముపసర్గస్య వోపసర్గ సమానాకారస్య పునరుక్తి రప్రసిద్ధోపసర్గ ఉతాప్రసిద్ధోపసర్గ సమానాకారో భిన్నలిఙ్గవచనసాదృశ్యం లోకాతీత పదార్థవాచక శబ్దో వినా ద్విధాతుఘటితం నాస్తి. లుఙ్ లఙ్ లిటో ఽధిక్రియా స్త్వేకశః ప్రథమ ద్వితీయ తృతీయసర్గేషు. ద్వితీయ తృతీయసర్గయోర్భూతేతర క్రియావాచక తిఙన్తరూపం న విద్యతే. పాణినీయ సూత్రాణా మవైదికానా ముదాహరణ మేతత్కావ్యమ్.

# ప్రతిన



ఈ కారకమను గ్రంథమున నున్న శ్లోకములందు, పాదపూరణమే ప్రయోజనముగాఁగల "తు-హి-చ-స్మ-హ-వై" అనుపదము లుండవు. ఉపసర్గములకుగాని, వానిలో సమానమైన రూపముగల పదములకుగాని, పునరుక్తులు లేవు. ప్రసిద్ధములుగాని యుపసర్గలుగాని, యప్రసిద్ధములై యుపసర్గలవలెఁ గనఁబడునవిగాని, లేవు. భిన్నలింగములును, భిన్నవచనములును, గల యుపమానములుండవు. లోకాతీతములైన వస్తువులను దెల్పు శబ్దములు లేవు. ఒక్క ద్విధాతువుతోఁ గూడిన పదములు గలవు. ఒకటి రెండు మూఁడు సర్గలందు వరుసగా లుఙ్ లఙ్ లిట్ క్రియాపదములు వాడఁబడినవి. రెండు మూఁడు సర్గలందు భూతకాలమును బోధింపని క్రియాపదములు లేవు. ఈ కావ్యము వైదికములుగానట్టి పాణినీయసూత్రముల కుదాహరణము.

# కథా సంగ్రహము



భరతవర్షమున వింధ్యపర్వతమునకు దక్షిణముగఁ బంచనది ప్రవహించుచున్నది. తన్నదీతీరమున సంశ్రితకల్పమను పేరుగల యొక గ్రామమున్నది. అందు విద్వాంసుఁడు తపోధనుఁడునగు మహేశ్వరుఁడను బ్రాహ్మణోత్తముఁడు గలఁడు. అతని భార్యయు నాతనివలె విదుషీమణి. పతివ్రత. సూక్ష్మగ్రాహిణి. ఆ పుణ్యదంపతుల సంతానములోఁ గనిష్ఠపుత్రుఁడు పరదేవతాంశమున జన్మించెను. ఆబాలుఁడు మాతృగర్భమందు వసించుకాలమందే, దేవత లా భగవత్పుత్రుని నుతించి, వాని యవతారప్రయోజనమును విని యానందించిరి. ఆ బాలునిపేరు తారకుఁడు. ఆతఁడు సార్థకనాముఁడు.

ఆ తారకుఁడు బాల్యమందే తన సహజప్రజ్ఞాపాటవమునఁ బ్రతిభావంతుఁడై, యా గ్రామమునకు సమీపముగా నున్న విబుధనగర మహత్త్వమును వృద్ధులవలన విని యొకనాఁడా పట్టణమును బ్రవేశించెను. తన నిశితమనీషామహిమంబున నా పత్తనమందలి యనాచారములను గ్రహించి, యిప్పుడీపత్తనమునఁ బూర్వవైభవమంతరించి, దురాచారములు ప్రబలి యున్నవని చింతించెను.

ఒకనాఁ డాతఁడటునిటుఁదిరుగుచు రాజోద్యానసమీపమున కేగి, యన్యాపదేశముగ నానగరచరితమును గూర్చి మధురముగఁ బాడుకొనుచుండెను. ఆ దేసమయమున నా యుద్యానవనమున విహరించుచున్న రాజకుమారుఁ డాగానమునకు,నాపద్యములందలి యర్థవిశేషమునకు ముగ్ధుడై, తనభటునిద్వారా యా తారకుని బిలిపించి, నవయౌవనములో జగన్మోహనాకారములో నున్న యా తారకుని జూచి, పరమానందభరితుఁడై, యాతని నాదరించి, తన తండ్రికడకుఁ దోడు

కొనిపోయి, వానిని దన దండ్రికిఁజూపెను. ఆప్రభువుకూడ, దారకుని గానమాధుర్యమునకుఁ గవితాధారకుఁ గల్పనాశక్తికి, దివ్యరూపమునకుఁ బరవశుఁడై, తన కుమారునితో పాటాతనిని తనసౌధమున నుండ నియమించెను. కొలఁదికాలములోనే యీ తారకరాజకుమారు లిరువురును ప్రాణమిత్రులయిరి. వారిరువురును మాసము దినములలోనే యన్ని దేశభాషలను, ఆదేశములందలి యాచారములను, సుకరముగ గ్రహించిరి. గురూత్తముల కడకేగి వారివలన నన్నివిద్యల రహస్యముల నెఱింగిరి. ఇట్లు సకలకళాపరిపూర్ణులై సర్వవిద్యావిశారదులై వారిరువురును, స్వతంత్రజీవనమును గావింప సంకల్పించి, రాజానుమతిని సార్వభౌమనివాసస్థానమైన పాశ్చాత్యదేశమున కొకదినమునఁ బోవ నిశ్చయించుకొనిరి.

ధూమనౌకలో సముద్రమునఁ బ్రయాణముఁ గావించుచు, వారిరువురు నందలి వింతలను జూచుచు, గొలదిదినములకుఁ పాశ్చాత్యదేశమందలి చంద్రద్వీపమునుఁ జేరిరి. క్రమముగ నాద్వీపమందు చంద్రకాంతానదీతీరమందున్న చంద్రమతి యను రాజధానిని జేరిరి.

అచ్చట తమ ప్రజ్ఞాకౌశలమునఁ బ్రజల యాదరము నార్జించుకొని, మంచిసమయమున చంద్రద్వీపసార్వభౌముని దర్శించిరి. ఆ చక్రవర్తియు, వీరి ప్రవర్తనాదికమును జక్కఁగఁ బరిశీలించి, వీరి యసమానుష కృత్యముల కానందించి వీరిని తన సైన్యమున కధిపతులనుగాఁ జేసెను. మాసముదినములయిన పిదప నొకనాఁడు సార్వభౌమునిసోదరుఁడొకచోట శత్రువులచే నాక్రమింపఁబడి నిర్బంధితుఁడయ్యెనను విషాద వార్త హఠాత్తుగ వినఁబడెను,

అంత వీరిరువురును, సార్వభౌముని [illegible]ంఁ బడసి, [illegible]మైన సైన్యమును గూర్చుకొని, నౌకలపై [illegible]యిన కేగి, శత్రువుల రహస్యములను గుర్తించి, హఠాత్తుగ వారిపైఁబడి, వారిని సర్వ

నాశన మొనరించి, రాజసోదరుని బంధవిముక్తుని గావించి, యా శత్రు సేనాధిపతిని బంధించిరి.

విజయవార్త రాజధాని జేరెను. సార్వభౌముఁడు సకలవైభవములతో నెదురేగి, వారిని తోడి తెచ్చెను. తన సోదరుని నోట నాకుమారవరుల ప్రతాప దివ్యములను విని మిక్కిలి యానందించెను. మరునాఁడు సభలోఁ దారకుని మిగులఁ బ్రశంసించి, తనరాజ్యమున వానికి ధర్మాధికార పదవి నొసంగెను. మఱియు నాతనిఁ దనప్రాణమిత్రునిఁగ బ్రకటించెను. రాజపుత్రునకుఁ దన పుత్రికనిచ్చి వివాహముఁ గావించి భరతవర్ష సార్వభౌమునిగ నాతని నభిషేకింపుమని తన సోదరునితోఁ జెప్పి, వారిని వారి దేశమునకుఁ బంపెను.

తారకుని ప్రజ్ఞాపాటవముచే నిర్మింపఁబడిన విమానమునధిష్ఠించి, నూతనదంపతులును, తారకుఁడును, యువరాజుతోఁ గూడి, త్వరితముగ విబుధనగరమును జేరిరి. సుముహూర్తమున రాజపుత్రుని సకలభారతవర్షమునకు సార్వభౌమునిఁగఁ బట్టాభిషిక్తుఁజేసి సార్వభౌమసోదరుఁడు స్వదేశమునకేగెను. రాజపుత్రుఁడు సార్వభౌముఁడై నిరాతంకముగ రాజ్యమేలెను. తారకుఁడు గూడ మిత్రునిచే గౌరవింపఁబడి, గృహస్థుఁడై సన్తానవంతుఁడై సుఖముండెను.



రచయితా : శ్రీమదజ్ఞాత ఆదిభట్ల నారాయణదాసః

అహో ఽహంతు చతుర్ముఖః త్వమసి మా హేతోన్ముఖీ చాంబసీ
త్వక్త్వాఽనంత ముఖీం కథం త్వమపి మాం చుంబేతి వ్యాహారత్
శ్రీ నారాయణదాస తా మనుగతం దృష్ట్వైవ వాక్ క్రీడితా
తత్వావృత్ప్రతిభా మహోజ్జ్వల మతి స్సోయం కవీనాం కవిః

బ్రహ్మశ్రీ ఆ. నారాయణదాసుగారిమీద

ఆచార్య : యస్వీ జోగారావుగారి పద్యం

నాయని నాల్గు మోములవునా యెటు ముద్రిత, మంచు నల్వయూ
హ్యాణమునా హసించెఁగ 'అనంతముఖున్ నను నెట్లు ముద్రిం
పోయెదో? యటంచు జెల్వను - 'ముద్రితదవ్ గను' మంచు నల్వ నా
రాయణదాసు గారికెఱిఁగెనందు పరవృత్తిని నమస్కృతుల్.

# కవి వ్యాఖ్యాతృ సన్నిహిత సంబంధము



| | |
|---|---|
| కవిగారిది | సువర్ణముఖీ నదీతీరము, |
| వ్యాఖ్యాతది | వేగవతీ నదీతీరము. |
| వారి గ్రామము | అజ్జాడ |
| వీరి గ్రామము | గుడివాడ |
| వారింటి పేరు | ఆదిభట్లవారు |
| వీరింటి పేరు | రాంభట్లవారు |
| వారి పేరు | సూర్యనారాయణదాసు |
| వీరి పేరు | లక్ష్మీనారాయణశాస్త్రి |
| వారు | హరికథా పితామహులు. |
| వీరు | బ్రాహ్మీభూషణులు. |
| వారు | హరికథాప్రవచన పటువులు |
| వీరు | పురాణ ప్రవచన సమర్థులు |
| వారు | స్వతంత్ర జీవనులు |
| వీరు | అస్వతంత్ర జీవనులు |
| వారు | మహాకవులు |
| వీరు | అనువాదకులు |
| వారు | ఆటపాటమాటల మేటి |
| వీరు | ఉపన్యాసక మూర్ధన్యులు |
| వారు | జగద్గురువులు |
| వీరు | ఆచార్యపర్యులు |
| వారు | పేరూరు ద్రావిడులు |
| వీరును | పేరూరు ద్రావిడులే |
| వారు | తాతలు |
| వీరు | మనుమలు |

వా[illegible] మాతామహులు, మహాకవిదాసుగారు అక్కచెల్లెండ్ర కుమారులు. కాన మాతామహుని కావ్యమునకు దౌహిత్రుని వ్యాఖ్యానము. ఇదియే కవి వ్యాఖ్యాతృ సన్నిహితసంబంధము.

కవి సర్వజ్ఞుడు. వ్యాఖ్యాత కించిత్ జ్ఞుడు.

మాయోపహిత చైతన్యము ఈశ్వరుడు. ఆ ఈశ్వరునకు మాయ అధీనమై యుండును. అవిద్యోపహిత చైతన్యము జీవుడు. ఈజీవుడు మాయాధీనుడై యుండును, కాని యీ జీవేశ్వరులిద్దరును మాయాకల్పితమైన ఉపాధిభేదముచే భేదముగాని వాస్తవిక భేదము లేదు. ఉపాధి నశించిన మిగిలినదాత్మయే కదా!

కావున పై వారిరువురకును బాహ్యలక్షణములను విడిచిన సా[illegible]త్వము సమానమే.

# కావ్య ప్రశంస

తారకము మహాకావ్యము. రచయిత మహాకవి. నా రక్షా పితామహుడు. వాగ్గేయకారకుడు. లయబ్రహ్మ. ఆటపాటలందు మేటి. పూర్ణ పురుషుడు. శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణదాస మహాదయుడు, సకలకళాప్రపూర్ణుడు.

పరిమాణములోఁ జిన్నదయ్యును ప్రౌఢతలో మిక్కిలి మిన్నయీ కావ్యము. ఇందు భారవికవి యర్థగాంభీర్యము, మాఘకవి సర్వంకషపాండిత్యము, శ్రీహర్షుని గ్రన్థగ్రన్థి విన్యాసములును సమ్ముఖముగఁ గానవచ్చును.

ఇది, భాషాపరిణతిలో, భావవిన్యాసములో, నలంకార రచన[illegible]తిలో, ధాతుప్రయోగపద్ధతిలో సర్వోత్కృష్టమై నాన్యతో దర్శనీయమై యున్నది.

ఆలంకారికులు నిర్దేశించిన మహాకావ్యలక్షణము [illegible] ఆవర్ణనలన్నియుఁ గథలో కలిసిపోయున్నవి. ఒకటి రెండు [illegible] రసములన్నియు నిందు [illegible]మమధురముగ నిరూపితములు. ఇతివృత్త ముత్పాద్యము. రాజపుత్త్రుడు నాయకుడు, తారకుడు ఉపనాయకుడు. ఇదియొక అమూల్యకావ్యబంధము. దీనికిదియే సాటి.

# మహోపకార స్మృతిః

"వ్యాకరణ సార్వభౌమ"
పేరి సూర్యనారాయణశాస్త్రి
రాజమహేంద్రవరము
1-3-1984

గురవే సర్వలోకానాం భిషజే భవ రోగిణామ్
నిధయే సర్వ విద్యానాం దక్షిణామూర్తయే నమః.

శ్రీమద్భారతీయాలంకారికాణాం మూర్ధన్యః, సకలదార్శనిక సిద్ధాన్తవేత్తా, జగన్నాథ పణ్డిత నరేన్ద్రః రమణీయార్థ ప్రతిపాదకశ్శబ్దః కావ్య, మితి కావ్యలక్షణం న్యరూపయత్. ఇదమేవ లక్షణమద్యతనై రాద్రియతే. తస్య చ లక్షణస్య శ్రీమతాం జన్మసిద్ధ సకలవిద్యానాం పుంభావ సరస్వతీనాం సర్వవేదవేదాఙ్గశాస్త్రార్థపారదృశ్వనాం మజ్జాడిభట్ట నారాయణదాస మహాకవీనాం ప్రబన్ధాస్సర్వాత్మనా ఉదాహరణం భవితుమర్హన్తి. ఏతేన పణ్డితరాజేన కావ్యస్య తద్ఘటనానుకూల శబ్దార్థోపస్థితి రూపా కవిగతా కేవలా ప్రతిభా కారణత్వేన ప్రత్యపాది. తేనైవ మహాశయేన దేవతా మహాపురుష ప్రసాదాది జన్యమదృష్టం ప్రతిభాయా హేతుత్వేన ప్రాదర్శి. నారాయణదాస మహోదయానాం వినైవ గురోస్సకాశాదధ్యయనం పరదేవతా ప్రసాదజన్యేన అదృష్టేన కావ్యకరణానుకూలా ప్రతిభా సముదపాది. ప్రతిజ్ఞాతఞ్చ నారాయణ దాసమహాకవినా స్వీయతారక కావ్యప్రారమ్భే,

"స్వభావ పాండిత్యబలేన కుర్వే" ఇతి ఏవమేవ కాశీశతకేపి,
"వ్యరచీత్థం మయా కాశీశతకం నైజధీమతా
శ్రీనారాయణదాసేన కవితాగాన శాలినా" ఇతి.

యద్వశేన ఏతే మహోదయా న్యాయవ్యాకరణాలఙ్కారవేదాన్తమీమాంసాది శాస్త్రపారదృశ్వానోఽపి విస్మయజనకాన్ నవరసభరితాన్

ప్రబన్ధరాజాన్ విరచయామాసుః. తే చ ప్రబన్ధా ఆన్ధ్ర, ఆఙ్గ్ల, సంస్కృత భాషాసు విరాజన్తే. తద్గ్రన్థావలోకనే శ్రీమతాం మహాకవీనాం కియతీ వ్యాకరణపారఙ్గతా? కియతీ అలంకార విన్యాసపద్ధతిః? కియద్వా వేదాన్తశాస్త్ర వైదుష్యమ్? కీదృశో వా భారతీయమతకలాదితత్త్వేషు విశ్వాసః? కీయాన్వా భాషావిష్కరణ పథః? కియద్వా వ్యంగ్యార్థ పరిపాకమ్? ఇత్యాది సర్వం స్పష్టీభవతి విశ్వేషాం విపశ్చిదపశ్చిమానామ్.

ఏవం స్థితే మహాకవిసమ్రాజితే “తేషాం పరిబన్ధానాం మధ్యే తారకాఖ్యం మహాకావ్యంపరి ఇష్టదశలోకయామః - పాణిని మహర్షిణా లౌకికానాం వైదికానాఞ్చ శబ్దానాం సాధుత్వం ప్రతిపాదితమ్. తేషాం మధ్యే లౌకిక శబ్దానాం సాధుత్వ ప్రతిపాదకాని యాని సూత్రాణి తేషాముదాహరణతయా కావ్యమిదం మయా నిర్మీయతే. ఇతి ప్రతిజ్ఞాకారి. “అనేన జ్ఞాయతే” ఇదం కావ్యం వ్యాకరణశాస్త్రోదాహరణ భూతమితి. సా చ ప్రతిజ్ఞా గ్రన్థసర్గాత్మకే అత్రకావ్యే సాకల్యేన మహాకవినా నిర్వ్యూఢా. పాణినీయే సనాదయః-12 వికరణాః-28, లకారాః-10, తఙః-18, కృత్ప్రత్యయాః శతం-100 సుపః-21 టాబాది స్త్రీ ప్రత్యయాః-9 తద్ధితాః ప్రత్యయాః ద్విశతం-200 ఇత్యేవ మష్ట విధాః ప్రత్యయాః సప్తతియాచతుర్ధశఞ్చమాత్రకే ఽ అధ్యాయత్రయే పాణిని కవినా ఉపాదిశ్యన్త.

ఏతేషాం ప్రత్యయానాం ప్రకృత్యా సంయోజనే ప్రయోగార్హాశ్శబ్దా నిష్పాద్యన్తే. ప్రకృతిశ్చ ధాతు ప్రాతిపదికరూపేణ ద్వేధా ప్రాదర్శి మునినా” ప్రకృతిప్రత్యయ సంయోజనే ఽపేక్షితం కార్యజాతమతిరిక్తమధ్యాయ పఞ్చకం బోధయతి. నిరుక్తాష్ట విధ ప్రత్యయాన్తైర్నిష్పన్న శబ్దా అత్రకావ్యే ప్రాదర్శ్యన్త, తేషాం సర్వేషాం శబ్దానామత్ర ప్రదర్శనే పౌనరుక్త్యభియా విరమ్యతే. పరన్తు ఇదమేక మవశ్యం వక్తవ్యమస్తి-వ్యాకరణ శాస్త్రే

తిజ్ ప్రక్రియా బహులా దురవగాహాచ, తత్రాపిలుజ్, లిటోః ప్రక్రియా దుర్ధరా దురవబోధాచ "భూతిమాత్రే లుజ్" అనద్యతన భూతేలజ్, భూతానద్యతన పరోక్షేలిట్ ఏపా ప్రక్రియా అతిక్లిష్టేతి మన్వానా స్తత్ప్రయోగేష్వేవ మమ పాణ్డి ... ప్రకర్షావిష్కరణ మావశ్య కమిత్యవగచ్ఛన్తశ్చ నారాయణదాస ... భాగవయః ప్రాథమికేసర్గత్రయే లుజ్, లజ్, లిడంతాని శబ్ద ... ప్రాయుఙ్క్త ఇతి తైః ప్రథమత ఏవ ప్రతిజ్ఞా కృతా.

# 1. సర్గే, లుఙ్ ప్రయోగాః

పాణినీయే-లుజి శబాద్యపవాదతయా లాఘవేన ప్రక్రియా నిర్వాహాయ'చ్లి' ప్రత్యయో వికరణో విహితః, సచ క్వాపి నశ్రూయతే. తస్యస్థానే పఞ్చ ప్రత్యయా ఆగోశ ... కితాః.

1. చ్లేః సిచ్ – ఏషశ్చ అనేకధా వివరిణమితః

(1) క్వచిల్లుగా దినా లుప్తః

శ్లో. 1. పసర్గే 20. అభూత్ 28. అగాత్ 32. అశక్త.

(2) క్వచిత్తస్య ఇడాగమః–

శ్లో, 1–18 అయోదిష్ట, 36. అలోకిష్ట-4 అజనిష్టాః 31 అగటీత్.

(3) క్వచిదిడ భావః–

శ్లో. 1-4 అవాత్సీత్ 8 అన్వసార్క్షీత్

(4) క్వచిత్సిచ్ ఇట్ ధాతోఃసక్

శ్లో, 1-54 అహాసీత్

2. క్సోఽపవాదతయా చ్లేశ్చ్లేః

శ్లో. 1–7, అనాయి 10 అభ్రాజి

3. తథా, చజ్

శ్లో. 1—18 అజీజనః 58 అపుప్రమదత్, అచక్రిశత్

4. తథా అజ్

శ్లో. 1-30 అవప్తత్ 9 అశిశ్రత్ 30 అరుదత్

5. తథా కోఽపి విహితః వరస్తు స ప్రకృతే నోప యుయుజే.

# 3. సర్గే లిట్ప్రయోగాః

ధాతోస్త్రైయత్యేన ద్విత్వం లిటివ్యధాయి

తత్ర విచిత్రాః ప్రకియాః కల్ప్యంతే

1) లిటి పరతః క్వచిత్ 'ఆమ్' వికరణః లిటోలుకి తతః లిట్పరకాణాం కృభ్వస్తీనా మనుప్రయోగః

సర్గ-1 శ్లో-1 కోలాచక్రతుః 2. ప్రబోధయామాస 3. వైద్యా మాస ఏషు ఆమన్తం భిన్నం పదమవ్యయమ్.

2) ఆకారాన్త ధాతోః పరస్మైపదే ... ఔకారః

4శ్లో. అన్తర్దధౌ 7. అబభౌ ... ధితస్థౌ

అన్యత్ర అకారః 6. జగామ 8 ఆ...

ఆత్మనే పదే ఏకారః 2 నిన్యే

3. అదధాతోః 'ఘస్లాదేశః' స. 1-20 జఘాస

శ్రీమతాం మహాకవీనామేష స్వభావః - యత్ స్వవర్ణితానాం పదార్థానాం తత్స్వరూపేణైవ స్వకావ్యోపబంధనమ్. తేచ పదార్థాః లౌకికాః శాస్త్రీయగమ్యా వా భవన్తు నామ. తత్రాపి విద్యాయోగతిః స్వాభ్యస్తానాం శాస్త్రాణాం తత్ప్రమాణ్యైవ ప్రదర్శనేన స్వకావ్య శోభా జననమిత్యేకా రీతిః. శాస్త్రార్థాన్ స్వస్వరూపేణాప్రదర్శ్య కేవలం తద్విషయ సంయోజనమాత్రేణ కావ్యస్య శోభాజనన మిత్యన్యా రీతిః.

ఆద్యా రీతిః మురారి శ్రీహర్షాదేః అన్యా రీతిః కాళిదాసాదేః ఆద్యాం రీతిం పరిశీలయామః. అనర్ఘరాఘవే" - శూర్పణఖామాల్యవతోస్సంవాదే "నహిస్థానివద్భావేన జహాతి క్షత్రియత్వమ్" చంద్రోదయవర్ణనే 'జయతి జనికర్తుః ప్రకృతితా".

శ్రీహర్షం పశ్యామః.

1) సమవాయి కారణగుణాః కార్యే సంక్రామన్తి న, నిమిత్త కారణగుణాః ఇతి నైయాయిక సమయః, వ్యభిచరితో వా? ఇత్యుత్ప్రేక్షతే
దమయన్తీ స్తనవర్ణనే,

కలశే నిజ హేతుదణ్డజః కిము చక్రభ్రమకారితాగుణః,

స తదుచ్చకుచౌ భవన్ ప్రభాఝర చక్రభ్రమ మాతనోతి యత్,

చక్రభ్రమః - చక్రస్య భ్రమణమ్ చక్రవాక భ్రాన్తిశ్చ.

2) అధరబిమ్బ మిత్యాదయ ఉపమితసమాసా అసమర్థా ఇతి, ఉపమానాని సామాన్యవచనైః ఇతి సూత్రే మహాభాష్యకారీయ సిద్ధాన్తో విలసతి. తత్రచ హేతుః సాధారణధర్మస్య ఉపమానోపమేయయోరుభయత్రాపి శాబ్దాన్వయేన ఉపమేయస్య సవిశేషణత్వేన అసామర్థ్యమేవ. ఏవంస్థితే 'అధరబిమ్బ' మిత్యత్ర అధరం బిమ్బమి[illegible] మసామర్థ్యేపి సమాస స్వీకరణమ్? అధరం బిమ్బం యస్మాదితి వ్యధికరణ బహువ్రీహిణా తస్య సమర్థత్వమేవ సిద్ధ్యతి. లోకే ఉపమానభూతం బిమ్బఫలం బైమ్బ్యధరోష్ఠాత్ అధరం=నీచ మితి కావ్యశోభాపి సమ్భవతీతి వర్ణయతి శ్రీహర్షః.

"అధరం కిల బిమ్బనామకం ఫలమస్మాదితి భవ్యమన్వయమ్
లభతేఽధరబిమ్బ మిత్యదః పదమస్మాద్రదనచ్ఛదం వదత్.

3) తమో నాతిరిక్తః పదార్థః కిన్తు తేజోఽభావరూపమేవ. నీలం తమశ్చలతీతి ప్రతీతిః దీపాపసరణోపాధికే భ్రాన్తిరేవ. ఇతి వైశేషిక సిద్ధాన్తః. తముపనిబధ్నాతి శ్రీహర్షః.

"ధ్వాన్తస్య వామోరు విచారణాయాం వైశేషికం చారుమతం
మతం మే.
ఔలూకమాహుః కిల దర్శనం తత్ క్షమం తమస్తత్త్వ నిరూపణాయ

కణాద శాస్త్రస్య వైశేషికమితి, ఔలూకమితి వ్యవహారః, తమసి యచ్చక్షుః పదార్థాన్ విశేషరూపేణ గృహ్ణాతి తదేవోత్కృష్టం ఖలు. తచ్చ దివాన్ధస్య చక్షుః రాత్రౌ వామయో రూర్వోః విశేషేణ చక్షుషా ప్రత్యక్షీకరణం సర్వాభిమతమితి సార్వజనీనస్సముదాచార ఇతి కావ్యశోభా. ఏషా చ వామోరు పదేన ధ్వన్యతే కవినా.

4) ఏవం నారదం ప్రతి ఇన్ద్రస్యవచనే ఉపేన్ద్రస్య జైమిని మునిత్వము దీతమితి వర్ణయతి కవిః.

"విశ్వరూప కలనాదుపపన్నః తస్య జైమిని మునిత్వముదీయే
విగ్రహం మఖభుజామసహిష్ణుః వ్యర్థతాం మదశనిం సనినాయ"

జైమినిర్మహర్షిః విశ్వరూపాణి = మీమాంసా సూత్రాణి రచయామాస. ఉపేన్ద్రోఽపి విశ్వరూపాణి = దశావతారాన్ దధార. జైమినిః దేవానాం శరీరాది పఞ్చకం నిషిషేధ నవమే, 'వజ్రహస్తః పురన్దరః' 'సహస్రాక్షో గోత్రభి ద్వజ్రబాహుః' ఇత్యాదీనా మర్థవాదత్వమఙ్గీచకార. ఉపేన్ద్రోఽపి దేవానాం విగ్రహం శాన్తస్తైస్సహ విరోధం న సేహే. అత ఏవ మమవజ్రాయుధస్య

వైయర్థ్యం నిరుపయోగత్వాచ్చ అకల్పయదితి కావ్యశోభా, అను జర్యా ఉపేన్ద్రస్య సాహాయ్యాత్ అహమిదానీం నిరుపద్రవో వసామీతి వ్యఙ్గ్యార్థః కావ్యశోభాం పుష్ణాతి. ఏవం

1) త్వం నైషధాదేశ మహో విధాయ కార్యస్య హేతోరపి నామ
లస్సన్
కిం స్థానివద్భావ మదత్తదుష్టం కాదృక్కృతవ్యాకరణః పునస్త్వః

2) ఇహ కిముషసి పృచ్ఛాశంసి కిం శబ్దరూపం
ప్రతి నియమితవాచా వాయసేనైష పృష్టః
భణ ! ఫణిభవశాస్త్రే తాతఙః స్థానినా కా
వితి విహిత తుహీవాగుత్తరః కోకిలోఽభూత్.

3) గత్వాన్తరా నలంభైమీం నాకస్య త్వం ప్రవేక్ష్యసి
షణ్ణాం చక్రిమసంయుక్తం పత్యమానణ్ణకారవత్.

4) ఉభయీ ప్రకృతిః కామే సజ్జేదితి మునేర్మతః
అపవర్గే తృతీయేతి భణతః పాణినేరపి

5) క్రియేత చేత్సాధు విభక్తిచిన్తా
వ్యక్తిస్తదా సా ప్రథమాభిధేయా
యాస్వౌజసాం సాధయితుం విలాసై
స్తావత్ క్షమా నామపదం బహుస్యామ్.

6) ఉదయతి స్మ తదద్భుతమాలిభి
ర్ధరణి భృద్భువి తత్ర విసృజ్యయత్
అనుమితోఽపి చ బాష్పనిరీక్షణాత్
వ్యభిచచార న తాపకరో నలః.

ఇత్యేవ మాదయః శ్యతశస్సన్తి కావ్యే. సర్వత్రాపి తత్తద్వ్య

స్త్రార్థాన్ స్వరూపేణైవ ప్రదర్శయతి తేన చ కావ్యస్య శోభాం జనయతి చ. అతఏవ 'నైషధం విద్వదౌషధ' మితి సార్వలౌకికీ ప్రతీతి స్సఙ్గచ్ఛతే.

ద్వితీయా రీతిః కాళిదాసాదేః. తేహి సర్వేషు శాస్త్రేషు విద్యమానాన్ సిద్ధాన్తాన్ సంప్రదాయాంశ్చ సూక్ష్మరూపేణ స్పృశన్తి నతు శ్రీహర్షాదయ ఇవ శాస్త్రార్థాన్ విమృశన్తి. యథా.

1) ఏతావతా నన్వనుమేయ శోభికాంచీ గుణస్థాన మనిన్దితాయాః, ఇతి అత్రైవ సాధ్యహేతూన్ వివిచ్య అప్రదర్శ్య అనుమాన ప్రక్రియాం దర్శయతి తావతా జ్ఞాయతే తస్య న్యాయ వైదుష్యమ్. ప్రయోగశ్చ ఇత్థం మల్లినాథేన కథితః. గౌరీనితమ్బం లోకాతిశాయి సౌన్దర్యం గిరిశాఙ్కారోహత్వాత్. యన్నైవం తన్నైవమ్.

2) 'అపవాదై రివోత్సర్గాః కృతవ్యావృత్తయః పరైః'

ఇదఞ్చ వాక్యం న్యాయ వేదాన్త వ్యాకరణ మీమాంసా శాస్త్రేషు విద్యమానాన్ బహూన్ విషయాన్ గర్భీకరోతి. నతు విషయప్రపఞ్చః కవినా నోట్టఙ్కితః.

3) 'శ్రుతే రివార్థం స్మృతిరన్వగచ్ఛత్'

సుదక్షిణా నన్దిన్యాః, మార్గమన్వగచ్ఛత్. ఇత్యస్య ఇదముపమానమ్. శ్రుత్యర్థాను గతయః ప్రమాణం, న స్వాతన్త్ర్యేణ విరుద్ధాస్త్వప్రమాణమేవ ఇతిహి సర్వదార్శనికానాం సిద్ధాన్తః సూక్ష్మేక్షికయా ప్రదర్శి. నన్దిన్యాః శ్రుతి సాదృశ్యం, సుదక్షిణాయాః స్మృతి సాదృశ్యఞ్చ ప్రత్యపాది. అనేన సర్వాత్మనా నన్దినీ సేవయైవ సుదక్షిణాయాః ఫలసిద్ధిః, నాన్యథేతి కావ్యశోభా. తథా ప్రత్యయ ప్రకృతియోగ సన్నిభః. ఇత్యాహ కాళిదాసః. మాఘోప్యాహ.

విజయస్త్వయి సేనాయాః సాక్షిమాత్రేఽపదిశ్యతామ్
ఫలభాజి సమీక్ష్యోక్తే బుద్ధేర్భోగ ఇవాత్మని.

కాపిలే తన్త్రే బుద్ధిరేవ సర్వాణ్యపి కర్మాణి నిర్వర్తయతి, ఫలన్తు పురుషో భుఙ్క్తే, ఇతి సిద్ధాన్తః, ప్రత్యపాది ఏవం సాక్షిమాత్రే భవతి (కృష్ణే) సేనయా కృతో విజయోఽపదిశ్యతే.

తథా:- అప్యనారభమాణస్య విభోరుత్పాదితాః పరైః
వ్రజన్తి గుణతా మర్థాః శబ్దా ఇవ విహాయసః

ఆకాశో విభుః భేరీదణ్డసంయోగాదిభిః జనితాశ్శబ్దా ఆకాశస్య గుణతాం యాన్తి. తద్వత్ కిఞ్చిదప్యకుర్వాణస్య విభోః సమర్థస్య ప్రయోజనాని స్వాధీనాని భవన్తి.

తథా : 'ధాతులీన ముపసర్గ ఇవార్థమ్' ఇత్యాహమాఘః.

ఏవ మనేకత్ర మహాకవయః శాస్త్రసమ్మతానర్థాన్ ప్రాదర్శయన్ ఏవం శాస్త్రవిషయే కవీనాం ద్వయీగతిః ప్రాదర్శి. ఆద్యారీతిః న సర్వసుగమా. పరన్తు కవేః పాణ్డిత్యప్రకర్షః ప్రతిభాతి. ఏతావతా నాస్త్యేషు న్యూనతా సమాపాదనీయా' ప్రకృతిః ఖలు సా తేషామ్'. ద్వితీయా రీతిస్తు సర్వేషాం హృదయఙ్గమా సుబోధా చ. యద్యపి కావ్యమార్గే శాస్త్రాణాం స్వస్వరూపేణ ప్రదర్శనం రసాస్వాదస్య విచ్ఛేదకారి తథాపి సంయోగే నఖక్షతానీవ రసాస్వాదముత్తేజయన్తి ఇతి సార్వలౌకిక మేతత్.

ద్వితీయాం రీతి మాశ్రయతాం మహాకవీనాం విషయే విదితా గమనికా పరిశీలనీయా. యత్ - ఆముఖే కేచన శబ్దా అసాధుత్వేన భాసన్తే. సమ్యక్పరిశీలనేన సాధవో భవన్త్యేవ. తాదృశ శబ్దానాం ప్రయోగేణైవ స్వకీయః శాస్త్రపటిమా ప్రతిభాతి, యథా- అధికరణే శేతేః '3-2-15 ఇతి సూత్రే 'గిరౌడశ్ఛన్దసి' ఇతి వార్తికేన గిరిశబ్దే

ఉపపదే శీఙః ఛందసి డో విహితః, గిరౌ శేతే ఇతి గిరిశః – ఏతద్రీత్యా శ్రియణే గిరిశ శబ్దశ్చ లోకే అసాధుత్వమేవ ఏవం స్థితే కాళిదాసః-

1) గిరిశముపచార ప్రత్యహం సా సుకేశీ
2) ఆరోపితం యద్గిరిశేన పశ్చాత్
3) శుశ్రూషమాణాం గిరిశోఽనుమేనే.

4) అధోపవిష్టే గిరిశాయ గౌరీ' ఇతి గిరిశ శబ్ద మసకృత్ ప్రాయుఙ్క్త. పూర్వోక్తరీత్యా లోకే గిరిశశబ్దోఽసాధురితి స్పష్ట మేవ ప్రతిభాతి హి. వస్తుతస్తు అయం శబ్దః లోకేపి సాధురేవ గిరిరస్యాస్తీతి విగ్రహే 'లోమాది పామాది పిచ్ఛాదిభ్యః శనేలచః' ఇతి సూత్రేణ లోమాదిత్వాత్ మత్వర్థీయశ్శః గిరిశః. ఇయఞ్చ ప్రక్రియా 'తద్ధితో వా' ఇతి వార్తికే మహాభాష్యకారైరేవ ప్రదర్శి

ఏవం ఙి ఫలా ధాతోః నిష్ఠాయా మనుప సర్గాత్ ఫుల్లక్షీబకృశో ల్లాఘాః (7-2-55) ఇత్యనేన ఫుల్లశబ్దో నిపాతితః. తేన ఉపసర్గరహిత స్యైవ సాధుత్వమ్ పరన్తు కాళిదాసః

1) లోధ్రంధ్రుమం సానుమతః ప్రఫుల్లమ్
2) ప్రఫుల్లరాజీవ మివాఙ్క మధ్యే
3) ఉషసి సర ఇవ ప్రఫుల్ల పద్మమ్.

ఇత్యాది ప్రాయుఙ్క్త ఫుల్ల = వికసనే ఇతి ధాతోః పచాద్యచి ప్రఫుల్ల మితి సాధురేవ భవతి.

ఏవం మహాకవీనాం గ్రన్థేషు విచిత్రాశ్శబ్దాః ప్రాయుజ్యన్త, తేహి పదశాస్త్ర మర్మజ్ఞాః "ఉదయతి వితతోర్ధ్వ రశ్మిరజ్జౌ" వితి మాఘః

"పరివిఘాటయితా సమఃత్వత''న్నితి భారవిః

"రక్షాం సీతి పురాపి సంశృణుమహే'' ఇతి మురారిః

హంసం తనౌ సన్నిహితం చరన్తమ్

మునేర్మనోవృత్తిరివ స్వికాయామ్' ఇతి శ్రీహర్షశ్చ.

ఏవం శ్రవణ మాత్రేణ అసాధుత్వేన భాసమానానాం సమ్యక్పరిశీలనే సాధూనామేవ సతాం శబ్దానాం ప్రయోగమాత్రేణ స్వీయం పాణ్డిత్య మావిశ్చక్రుర్మహా కవయః. ఇయఞ్చ రీతిః ప్రకృత తారక గ్రన్థేఽపి దృశ్యతే. అత్ర చ న ఖ్యాత్ శాస్త్రార్థ ప్రదర్శనం శ్యాదిత్యమ్. ప్రకృతగ్రన్థ నిర్మితిస్తు కేవలం స్వీయ పదశాస్త్ర పాటవ ప్రదర్శనాయైవ. అతః యే యే శబ్దా ఆముఖే అసాధుత్వేన ప్రతి భాన్తి, త ఏవ విచారణే సాధుత్వ మాప్నువన్తి తాదృశాశ్శబ్దాః మహాకవినా ప్రాయుజ్యన్త తాన్ కిఞ్చిత్ప్రశ్యామః.

1) ద్వితీయసర్గే 12 శ్లోకే 'అయథాతథ్య' మితి మహాకవేః నారాయణదాసస్య ప్రయోగః. అత్ర కాచిద్విప్రతిపత్తి రస్తి, యథాతథా శబ్దాత్ బ్రాహ్మణాదిత్వాత్ భావే ష్యఞి, నఞ్ పూర్వ కత్వే "యథాతథా శబ్దాత్ పూర్వ యోః పర్యాయేణ 7-3-31 ఇతి సూత్రేణ పర్యాయేణో భయపదవృద్ధిర్విహితా. తేన 'ఆయథాతథ్యం ఆయాథాతథ్య' మితి హి రూపద్వయం సిద్ధ్యతి. ప్రకృతే ఏకస్యాపి పదస్య వృద్ధిర్నకృతా ఇత్యక్షేపః ప్రతిభాతి. అత్రమహద్భిర్యత నీయమ్ మమ తు ప్రతిభాతి. తథ్యమనతిక్రమ్య యథాతథ్యమితి పదార్థా నతి వృత్తా వవ్యయీభావః, తతః యథా తథ్యమభావః. అయథాతథ్యమితి అర్థాభావే అవ్యయీ భావః యథాసట్సం జ్ఞా సూత్రే యథాలక్షణ మప్రయుక్తే ఇతి మహాభాష్యే అవ్యయీభావద్వయమ్, న యథాతథ్యమ్ =అయథాతథ్యమితి యద్వానఞ్ తత్పురుషేఽపి తస్య సాధుత్వం సిద్ధ్యతి. 'సాయథా తథ్య వృత్తి' మితి మూలమ్, అత్ర స+అయథా తథ్య ఇతి చ్ఛేదమాశ్రిత్యైవ విచారః ప్రస్తుతః. యది తు స+ఆయథా

తథ్య ఇతి చ్ఛేదః క్రియతే తదా బ్రాహ్మణాదిత్వాత్ ష్యఞి, నిరుక్త న్మాత్రేణ పూర్వపద మాత్రస్య వద్ధా, సవర్ణదీర్ఘే. సాయథాతథ్య ఇతి తద్ధితాన్తం సాధ్వేవ, తత్ర న కాపి విప్రతిపత్తిః, ఏవఞ్చ అవ్యయీభావద్వయ స్వీకారే అవ్యయీభావ నఞ్ తత్పురుషయోః తద్ధితాన్తాశ్రయణేవా తేన సహేతి తుల్యయోగే (2-2-28) ఇతి బహువ్రీహౌ, సహస్య సాదేశే సవర్ణదీర్ఘేచ సాయథా తథ్య వృత్తమితి నారాయణ దాస మహాకవేః ప్రయోగ స్సఙ్గచ్ఛతే. ఏతత్ప్రకారత్రయం మనసి కృత్వైవ ఏవ విశిష్టప్రయోగో మహాకవినాఽకారి. అత ఏవ 'స్వభావ పాణ్డిత్య బలేన కుర్వే' ఇతి ప్రతిజ్ఞా నిర్వ్యూఢా. మధ్యమపక్షమాశ్రిత్య శ్రీలక్ష్మీనారాయణశాస్త్రిభిః వ్యాఖ్యాతమ్.

2) సర్గే, 31 శ్లోకే 'వ్యపణాయది'తి శ్రీదాసమహాకవేః ప్రయోగః. విపూర్వకాత్ పణధాతోః లఙి వ్యపణాయత్ ఇతి రూపమ్. అత్ర కాచన విచికిత్సా, పణధాతోః స్తుతౌ "గుపూధూప విచ్ఛిపణి పనిభ్య ఆయః" 3-1-32 ఇతి సూత్రేణ ఆయప్రత్యయే పణాయ ఇతి జాతే "సనాద్యన్తా ధాతవః" ఇతి విశిష్టస్య ధాతుత్వే తతో లఙి అడాగమే వ్యపణాయదితి రూపమ్. స్తుతావన్యత్ర తు న ఆయప్రత్యయః. అతో లఙి ఆత్మనేపదే వ్యపణత ఇతి రూపమ్ ఏవఞ్చ స్తుతౌ వ్యపణాయత్ ఇతి, అన్యత్ర వ్యపణత ఇతి భవతి. వ్యపణాయదితి కథం సఙ్గచ్ఛత ఇతి హి ప్రశ్నః. ఏవం సమాధీయతే, పణతే ఇతి పణః పచాద్యచ్, తతః "ప్రాతిపదికాద్ధాత్వర్థే బహుల మిష్ఠవచ్చ" ఇత్యనేన ఆచష్ట ఇత్యర్థే ణిచ్, ఇష్ఠవద్భావేన టిలోపః, తస్యస్థానివద్భావేన నోపధావృద్ధిః తతః కర్తరి లఙి, తిపి ఇకారలోపే, శపి, గుణే - అయాదేశే, విశబ్ద యోగే యణి వపణాయత్. అతః వ్యపణాయదితి దాసకవి ప్రయోగ స్సాధీయానేవ.

3) 5 సర్గే, 56 శ్లోకే అర్థయస్వ ఇత్యత్రాయమాక్షేపః. అర్థశబ్దాత్ ప్రాతిపదికాత్ ణిచ్ప్రత్యయే "అర్థవేదయోరాపుగ్వక్తవ్యః" ఇత్యనేన ఆపుగాగమే తతః లోటి ఆత్మనేపదే మధ్యమపురుషైకవచనే అర్థాపయస్వేతి భవితుమర్హతి, ఆగమం వినా అర్థయస్వేతి కథమ్? అత్ర సమాధీయతే. నేదమర్థశబ్దాత్ ప్రాతిపదికార్థేణిచి రూపమ్ కిన్తు అర్థ ఉపయాచ్ఞాయామ్ ఇతి చౌరాదికాద్ధాతోః ణిచి రూప "మర్థయస్వేతి భవతి, యద్వా హేతుమణ్ణ్యన్తాత్ లోటి మధ్యమపురుషైకవచనే చ అర్థయస్వేతి రూపమ్. మమ సాహాయ్యమితరైః ప్రార్థనాం కారయేదితి తాత్పర్యమ్. యది తు ఇతరానపేక్షయా స్వయమేవ ప్రార్థయస్వేత్యాశయకత్వే తు నివృత్తప్రేషణాద్ధాతోః హేతుమణ్ణావపి ప్రకృత్యర్థ సిద్ధిః, తథా చ ప్రయోగః—

"ప్రార్థయన్తి శయనోత్థితం ప్రియాః" ఇతి

4) 4 సర్గే 35 శ్లోకే "సమచలయత్" ఇతి.

అత్రేయం శఙ్కా—చల ధాతోర్హేతుమణ్ణౌ, ఉపధా వృద్ధౌ తతః కర్తరి లఙి అడాగమే సమాయోగే "సమచాలయదితి భవితుమర్హతి. అథకథం" సమచలయదితి సమాధీయతే. భ్వాదిగణే ఘటాదౌ 'కమ్పనే చలి' రితి పఠ్యతే. తస్య చలనార్థే 'ఘటాదయో మితః' ఇతి మిత్త్వే 'మితాం హ్రస్వః' 6-4-92 ఇతి హ్రస్వే సమచలయదితిరూపం అకమ్పయదిత్యర్థః. విససర్జేతి తాత్పర్యమ్. కమ్పనాదన్యత్రతు న మిత్త్వమ్. "శీలం చాలయతి" అన్యథాకరోతీత్యర్థః.

5) 1 సర్గే-17 శ్లోకే. వేత్తుమితి రూపమ్ అన్యవేదితుమిత్యర్థః. అత్ర కేచిదాచక్షిరన్. విద సత్తాయాం, దైవాదికో ధాతుః అనిట్ కారికాసు 'పద్యతి ద్విద్యతి ర్వినద్' ఇతి శ్యనానిర్దేశాత్ దైవాదిక

ఏవానుదాత్తః. తతః తుముని 'ఏకాచ ఉపదేశేఽనుదాత్తాత్' (7-2-10) ఇతి ఇటో నిషేధే వేత్తుమితి రూపమ్. ప్రకృతే విదేః జ్ఞానార్థకత్వాత్ ఇటా వేదితుమితిస్యాత్ అత్ర జ్ఞానార్థకత్వాత్ కథం వేత్తుమితిరూపం? సత్యం, వేత్తుమితి రూపసిద్ధౌ సత్యజ్ఞానార్థకత్వం లక్షణయా స్వీక్రియతే.

ఏవం పరిశీలనే ఏతాదృశ నిగూఢ ప్రక్రియా జ్ఞానవతామేవ నారాయణదాస మహాకవి పద్యేషు పదాని సాధుత్వేన ప్రతిభాన్తి నాన్యేషామితి న వివిచ్య వక్తవ్యమ్. అత ఏవ నారాయణదాసః కాళిదాసాది ప్రబన్ధేష్వివ పదరచనామకరోత్. ఏతాదృశ వ్యాకరణ పరిజ్ఞానమేవ కవేః ముఖ్యం ప్రయోజనమ్.

ఇదం త్వవశ్య మవధేయమ్ యత్. "పాణౌకృత్య జయార్థ" మితి చతుర్థసర్గే పద్యమ్.

జయార్థమ్ = జయలక్ష్మీమ్, పాణౌకృత్య = పరిణీయ. ఇతి లక్ష్మీనారాయణశాస్త్రిణో వ్యాఖ్యాన్.

వెమ్పరాల సూర్యనారాయణ శాస్త్రిణ స్త్వేవ మభిప్రయన్తి- జయార్థం = జయలక్ష్మీమితి వ్యాఖ్యాతుః ప్రమాదః, అతో మూలే జయర్ధిమితి పాఠస్స్యాత్ సూర్యరాయాన్ధ్ర నిఘణ్టౌ ఋద్ధిశబ్దస్య సమృద్ధిః పార్వతీ, లక్ష్మీరిత్యర్థ త్రయం కథితమ్ తద్బలాజ్జయ× ఋద్ధిమ్ = జయర్ధి = మతివృద్ధిమ్, లక్ష్మీమితి వాఽర్థో లభ్యతే. అతయేవ పాణౌకృత్య = పరిణీయేతి లక్ష్మీనారాయణ శాస్త్రిణాం వ్యాఖ్యాఽపి సఙ్గచ్ఛత - ఇతి.

అత్రేదం బోధ్యమ్ - అర్థశబ్దో ధనవాచకః. ధనఞ్చ లక్ష్మీ రూపమ్. అతో జయార్థా మిత్యస్య జయలక్ష్మీ మిత్యర్థ స్సిద్ధ్యతీతి లక్ష్మీనారాయణ శాస్త్రిణామాశయః తావన్మాత్రేణ జయలక్ష్మీమిత్యర్థ శ్శబ్దశక్త్యా న లభ్యతే. అతో ఋద్ధిశబ్ద ఘటితః పాఠస్స్వీకర్తవ్యః తేనార్థ సఙ్గతిరిత్యభిప్రాయో వెమ్పరాల మహోదయానామ్.

ద్వితీయసర్గే అసుఖ్యదితి పదం ప్రయుక్తం మహాకవినా తద్రూప సిద్ధిరిత్థమ్. సుఖదుఃఖ తత్క్రియాయామితి కణ్డ్వాదిగణే పాఠః, తతః "కణ్డ్వాదిభ్యో యక్" ఇత్యనేన స్వార్థే యక్ప్రత్యయః సుఖ+య ఇతి స్థితే యకః ఆర్ధధాతుకత్వాత్ "అతో లోపః" ఇత్యకారలోపే సుఖ్య ఇతి జాతే సనాద్యన్తా ధాతవః ఇతి విశిష్టస్య ధాతుత్వే తతః కర్తరి, లఙి, అడాగమే, తిపి, ఇకారలోపే, శపి, పరరూపే అసుఖ్యదితి-

అత్ర యఙాగమమన్వస్తే కేచన విమర్శకాః, తత్తు న సమ్యక్ యఙః కిత్త్వం దృష్ట్వా తే బభ్రముః, యఙ ఆగమత్వే సుఖ ఇత్యత్ర లోప ఇత్యకారలోపానాపత్తేః సనాద్యన్తాధాతవ" ఇత్యనేన ప్రత్యయాన్తత్వ నిబన్ధన ధాతుత్వానాపత్తేశ్చ.

కిఞ్చ ఏతే విమర్శకా యఙ్లుం ప్రత్యయం కంచన మన్యన్తే, తదపి నయుక్తమ్. యఙ్లుక్ న ప్రత్యయః, కింతు యఙ్ తస్య యఙోఽచిచేత్యనేన లుక్శబ్దేన లోపో విహితః. ఏనాం యఙ్లగన్తప్రకరణం, యఙన్త ప్రక్రియేతి వ్యవహరన్తి. ఏతన్మాత్రేణ తస్య ప్రత్యయత్వం సిద్ధ్యతీతి దిక్.

# వ్యాఖ్యాన రీతిః

ఏతాదృశస్య ప్రబన్ధరాజస్య అనుకూలా వ్యాఖ్యా అపేక్ష్యతే. వినా వ్యాఖ్యానం తారక కావ్యం న సుజ్ఞాతం భవతి. పాణినీయలౌకిక సూత్రాణా ముదాహరణమేతదితి ప్రతిజ్ఞాతం కవివర్యైః. అప్రతిజ్ఞాతమపి కోశస్య బలం ప్రాదర్శి కావ్యే. అతః వ్యాకృతిః కోశశ్చ ఏతత్కావ్యార్థ పరిజ్ఞానే అత్యన్తముపకురుతః. ఏవం స్థితే శ్రీమద్భిః కల్లూ ఈశ్వర రాయ మహోదయైః తారక కావ్యవ్యాఖ్యాన నిర్మాణాయ శ్రీరామ భట్ట లక్ష్మీనారాయణశాస్త్రిణః ప్రేరితాః. తత్ప్రేరణామఙ్గీకృత్య శాస్త్రిభిః భావార్థ దీపికేతి వ్యాఖ్యా వ్యరచి. తేహి శాస్త్రివర్యాః పాలూరు గ్రామే స్థాపితే వేదసమాజే సాహిత్యే అధీతినః. తేషాం కోశ బలమధికం జాగర్తి. తాన్ విజయనగర మహారాజ సంస్కృత కళాశాలాయాం మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిణః, మహామహోపాధ్యాయ పేరి వేంకటేశ్వరశాస్త్రిణః, మహోపాధ్యాయ [illegible] వేంకటశాస్త్రిణః న్యాయవేదాన్త సాఙ్ఖ్యయోగాది దర్శనాచార్య గంటి సూర్యనారాయణ శాస్త్రిణశ్చ శాస్త్రాణి అధ్యజీగపన్. ఏతాదృశాః లక్ష్మీనారాయణశాస్త్రిణః వ్యాఖ్యారచనే బద్ధదీక్షా ఆసన్. తేహి-

"ఇహాన్వయముఖేనైవ సర్వం వ్యాఖ్యాయతే మయా
నామూలం లిఖ్యతే కిఞ్చిత్ నానపేక్షిత ముచ్యతే."

మల్లినాథ ప్రతిజ్ఞామనురున్ధానాః కావ్యం వ్యాకుర్వన్. తత్ర కావ్యార్థ పరిజ్ఞానస్య యావతీ వ్యాకృతి రపేక్ష్యతే సాన్యత్రేఽపి. అధిక వ్యాకృతి ప్రదర్శనన్తు తత్ర నోపయుజ్యతే ఇతి మనీషయా విస్తరేణ పద శాస్త్రం న ప్రదర్శితమ్.

"అభ్రాజి తాభ్యాం ధరణీ చిరాయ'- 'తత్రత్యకా' చలదుచ్చూడ చూడవాన్, అనువత్, ఉపఘ్న, అచ్ఛగత్య. ఇత్యాదీనాం విశిష్టశబ్దానాం విషయే వ్యాకరణ ప్రక్రియా విస్తరేణ నిరూపితా. కిఞ్చ కోశబలం వినా ప్రకృతకావ్యం నాధిగన్తుం శక్యత ఇతి సమనన్తరముపోత్క్రమ్.

| | |
|---|---|
| 1) నిష్కుటాన్తే | 2) దివాకీర్తి |
| 3) ఉరస్యన్తః | 4) పాకయూకాః |
| 5) శివద్యాపి | 6) ప్రతోలీషు |
| 7) సింహాసంహననా | 8) హైయఙ్గవీనః |
| 9) నిష్ఠానమ్ | 10) కూర్చికా |
| 11) మన్తు | 12) విశేషక |
| 13) భ్రమరక | 14) ఆప్రపదీన |
| 15) దేవచ్ఛన్ద | 16) అనుపదీన |
| 17) నాకే | 18) కోలాఞ్చక్రతుః |
| 19) కూపకేన | 20) గుణవృక్షకమ్ |
| 21) ఆనాయ | 22) కువేణీ |
| 23) వితర్ది | 24) వప్రః |
| 25) కేదారః | 26) అవదాతః |

27) ఆజ్ఞాయాః
28) కాణ్డ
29) యథాజాతః
30) తీరసః
31) శిశ్విదానం
32) తద్వదః
33) పాదాతం
35) వాత్రమ్.

ఇత్యాదీని కోశమాత్రప్రసిద్ధాని పదాని కవినా ప్రాయోజిషత. నామలిఙ్గానుశాసనాది కోశపరిజ్ఞానాభావే ఏతాని పదాని సంస్కృతాని భాషాన్తరాణి వేతి వ్యాముహ్యేరన్ పాఠకాః తాదృశప్రమాదో మాభూదితి లక్ష్మీనారాయణశాస్త్రివర్యాః సర్వాన్ కోశానేకముఖీకృత్య ప్రథమతః పదస్య అర్థం ప్రదర్శ్య, తస్య ప్రమాణతయా కోశం లిలిఖుః. తేన మహానుపకారః సంవృత్తః, కోశప్రదర్శనం రామభట్టానామేవ సుకరమాసీత్. నాన్యేషామిత్యత్ర న కాపి సంశీతిః. తేహి నిరుక్తరీత్యా వ్యాఖ్యానస్య యే యే అంశా అపేక్షితాస్తాన్ సర్వానపి ప్రదర్శయామాసుః. ప్రథమతస్సమన్వయం, అనన్తరమ్భావం విలిఖ్య దేశభాషా వశం పదాన్సన్తః సర్వేషామపి పద్యానాం స్వదేశభాషాయామపి తాత్పర్యం ప్రోల్లిఖన్.

ఏవం మూలగ్రన్థస్య వ్యాఖ్యాగ్రన్థస్య చ సుకృతినోః శ్రీవుంసయోరివ మహదానుకూల్యం సఞ్జాతమ్ ఇతి ఆన్ధ్రప్రదేశస్థాస్సర్వేఽపి గ్రన్థకర్త్రోః అధమర్ణా ఏవ ఆసన్నితి దృఢమహం విశ్వసిమి. ఏతద్గ్రన్థప్రచారాయ శ్రీమన్తః ధనవన్తో మహాన్తః ఉదారచరితాః కర్త్రా ఈశ్వరరాయ మహోదయాః బద్ధదీక్షా భవన్తీతి మహదిదం ప్రమోదస్థానమ్. లోకానామేతాదృశ మహోపకార కారణాయ ఈశ్వరరాయ మహోదయాయ ఆయురారోగ్యైశ్వర్య భోగభాగ్యాది జాతం శ్రియః పతిః ప్రసాదయేదిత్యాశాసే.

శ్రీః

## —: అ వ తా ర క ము :—

1. (శ్రీ నారాయణదాస కృతమైన "తారక" కావ్యానికి సమీక్ష)

2. (శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి విరచితమైన తారకవ్యాఖ్యకు అభినందనము)

అప్పల్ల సోమేశ్వరశర్మ
విశాఖపట్నం-13
24-3-1988

శ్రీః

## —: అ వ తా ర క ము :—

వ్యాకరణాలంకార చక్రవర్తి, - సాహిత్య విశారద, - వ్యాకరణ విద్యాప్రవీణ, - భాషాప్రవీణ.

**అప్పల్ల సోమేశ్వరశర్మ**, యం. ఏ; పి. ఒ. యల్.
ఉపాచార్యుడు (విశ్రాంతుడు)
సంస్కృతవిభాగము,
ఆంధ్ర విశ్వవిద్యాలయము: (వాల్తేరు).

"తారకము" ఒక సంస్కృత మహాకావ్యం, కర్త శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు, వ్యాఖ్యాత శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారు, వ్యాఖ్యానాదులకు ప్రోత్సాహకర్త శ్రీ కరా

ఈశ్వరరావుగారు, కావ్యం కమనీయంగా ఉంది చవులూరించింది. కర్త అంతరంగంనుంచి ప్రబోధించారు. వ్యాఖ్యాత సౌహార్దంతో వెన్ను తట్టేరు. ప్రోత్సాహకర్త అన్వర్థంగా ఆదరించి వరించేరు. గుణచయం నన్ను బంధించింది. "ద్విర్బద్ధం సుబద్ధం భవతి" అన్నమాటకుబదులుగా "త్రిర్బద్ధం పరిబద్ధం భవతి" అన్నట్లయింది. నాలుగు దశాబ్దాలపాటు కావ్యాలంకార శాస్త్రపరిచయం నాకుందిగదా!" అన్న విశ్వాసం కూడా ఏర్పడింది. ఇంత తదనం ఉన్నందువల్లనే ఈ దిగువ కొన్ని విషయాలను నేను సూచ్యప్రతీకంగా జరిగింది. అవి కూలంకషాలూ కావు, తలస్పర్శులూ కావు- స్థాలీపులాకాలు మాత్రం అవుతాయి.

ఇక ఉద్దేశక్రమానుసారంగా ప్రస్తావించుకుందాము- "తారకము" అయిదుసర్గల కావ్యం, మొత్తం రెండువందల తొంభైఎనిమిది శ్లోకాలు ఇందులో ఉన్నాయి. కథ చాలా చిన్నదే. అతిస్థూలంగా (పరమసంగ్రహంగా ఉంటుంది— "భారతదేశం - వింధ్యప్రదేశం - పంచనదీతీరం-సంశ్రితకల్పమనే గ్రామం - మహేశ్వరుడనే శ్రోత్రియ బ్రాహ్మణుడు, అతని భార్య— ఆదంపతులకు పరదేవతాంశంగా ఒక కుమారుడు కలిగేడు - అతని పేరు తారకుడు - పెరిగి పెద్దవాడై సకల కలాపూర్ణుడయ్యేడు-అతనికి దేశయాత్రాభిలాష కలిగింది-ముందుగా విబుధనగరం వెళ్లేడు - అక్కడ రాజకుమారునితో పరిచయంకలిగింది- రాజున్ను చక్కగా ఆదరించాడు- రాజకుమారుడూ తానూ కలిసి, సముద్రయానం చేసి, చంద్రద్వీపం చేరుకున్నారు- అది భారత చక్రవర్తి నివాసం - చంద్రమతీనగరం దాని రాజధాని - చక్రవర్తి వీరిని చూచి సంతోషించి స్నేహం చేశాడు- వీరిద్దరూ ఆపదలో చిక్కుకున్న చక్రవర్తి తమ్ముని సంరక్షించారు- అందువల్ల మరీ పొంగిపోయి చక్రవర్తి తన కూతురును రాజకుమారునికిచ్చి, వివాహం చేసేడు- అంతే కాకుండా దానితోపాటు తన సామంతరాజ్యమైన కర్మభూమికి (భారతదేశం) స్వాతంత్ర్యం ఇచ్చి, అల్లునికి ఆ రాజ్యాధికారం అప్పగించాడు.

తారకుని ఘనంగా సత్కరించి బ్రాహ్మణజాతికి కొన్ని వరాలిచ్చాడు. తారక రాజపుత్రులిద్దరూ స్వదేశంవచ్చి సుఖంగా ఉన్నారు.

ఈ చిన్న ఇతివృత్తం కేంద్రంగా ఒక పెద్ద కావ్యం విస్తరించింది. కస్తూరి కొంచెమయినా పరిమళ మధికం. మణి చిన్నదయినా కాంతి హెచ్చు. వజ్రం అల్పమైనా సారం అనల్పం. ఆ విధంగానే స్వరూపత లఘువుగాఉన్నా గుణగణాలనుబట్టి ఆత్మసౌందర్యాన్నిబట్టిన్నీ తారకం మహాకావ్యం అనిపించుకుంది- శబ్దార్థాలు, గుణాలంకారాలు, శయ్యాపాకాలు, రీతివృత్తులు, వ్యంగ్య వైభవం - ఆదిగా ఆలంకారికులు చెప్పిన కావ్యసంపద అంతా ఇందులో అమరిఉంది. ఏ ఒక్క పద్యం పరిశీలించినా ఈ అంశం విశదం అవుతుంది. ప్రతిపాద్యమైన విషయం, నాయకుడు రసం, అపరరసమైనంతవరకు వర్ణనలు- ఇవన్నీ దీనికి మహత్త్వాన్ని సంపాదించాయి. రెండే రెండు సర్గలున్న కాళిదాసుని మేఘసందేశం మహాకావ్యం కాలేదా? పాడవుతున్న సమకాల సమాజాన్ని బాగుచేయాలనీ, అందుకు దేశానికి స్వాతంత్ర్యం అవసరమనీ, దాన్ని చక్రవర్తిని మెప్పించి సంపాదించడమే మంచిదనిన్నీ ఈ కావ్యంలో ప్రతిపాదితమైన విషయాలు. చరిత్ర, సమాజం, రాజకీయం - ఈ మూడున్ను ఇక్కడ పెనవేసుకొని ఉన్నాయి. నాయకుడు తారకుడు. అతడు కుటుంబతారకుడు- సమాజతారకుడు - దేశతారకుడు-చివరకు సంసారతారకుడున్ను అవుతాడు. ఈ ఔచిత్యాన్ని అనుసరించే "తారకము" అనే నామకరణం జరిగింది. సహనాయకుడు లేక ఉపనాయకుడు విబుధనగర రాజకుమారుడు. వీరరసం అంగిరసం. అది పాండిత్య వీరంగాను, దయావీరంగాను, యుద్ధవీరంగాను అనేకరూపాలతో కనబడుతుంది. శృంగారం, అద్భుతం, భయానకం, శాంతం, మొదలయినవి అంగరసాలుగా అక్కడక్కడ చోటుచేసుకున్నాయి. దేవతలు బాల తారకుని స్తుతించడం, తారకుని బాల్యవర్ణనం, విబుధనగర వర్ణనం, యుద్ధవర్ణనం, రాజధానీవర్ణనం మొదలయినవి కొంగ్రొత్త పోయగా

లతో నడిచేయి. ఈ విధంగా "ఉపదేశం, సద్యః పరనిర్వృతి" అని కావ్య ముఖ్యప్రయోజనాలను కూడా సహృదయులకు "కారకం" అందిస్తుంది భవతు.

ఇవన్నీ ఒక ఎత్తు. "సౌశబ్ద్యము" కేవలం ఒక ఎత్తు సామాన్యులకు సాధ్యముకానివీ, వైయాకరణైక శరణ్యాలూ, ఆలోచనామృతాలూ అయిన శబ్దాలు పదేపదే ఈ కావ్యములో దర్శనమిస్తాయి. తథాపి కొన్ని క్రియాపదాలు "నభూతో న భవిష్యతి"అన్నంతగా కనిపిస్తాయి. దేవసభ, ఉన్నసమ్, సర్వవేదః, తీర్థధ్వాంక్షః, గేహేశూరః, అహంయుః, ఖట్వారూఢః, కింపచానః, శిశ్విదానః, కద్వదః, భేదం భేదమ్, ఖాదం ఖాదమ్, అన్వగ్భావమ్, ప్రియప్రియేణ, ప్రియాకృత్య, ద్వితంత్రః, గౌలక్షణికః, సుదివాః, సృజ్యమానః, మొదలగు వందలకొలది శబ్దాలు ఎడాపెడా తగులుకొని, "పాణినీయం జిహ్వాగ్ర ముందున్నదా ? లేదా?" అని పండితులను సైతం ప్రశ్నిస్తాయి. సమ్యుతిచత్, అతితిరాయత్, అససధ్రాయత్, అశిశ్రియత్, అమమ్రదత్ అపస్పృథత్, అదద్రఢత్, అచక్రశత్, అనుబోభూయాంబభూవే, సుఖాయతే, మొదలయిన వందలకొలది తిజంతాలు, మహావైయాకరణుని కూడా "ఖనూచి"గా (వెంటనే ప్రక్రియ తోచక బుర్రగోక్కుంటూ ఆకాశంవైపు చూచేవాడు) చేయక మానవు. వీటిని వివరించడం ప్రారంభిస్తే అదొక పెద్దగ్రంథంగామారి 'పానకంలోపుడక' అవుతుందని ఊరుకోవడం జరిగింది. అయితే ఈ ప్రయోగాలు అర్థాస్వాదానికి మాత్రం అడ్డురావు "పోపులో మిరపకాయలవలె" మధ్యమధ్యను "చుర్రు" మనిపిస్తూ ఉంటాయి. కాగా ఇదొక విధంగా "భట్టి కావ్యం"వలె సాగిందనవచ్చును. అందువల్లనే "పాణినీయసూత్రాణామవైదికానాముదాహరణమే తత్కావ్యమ్" (లోకభాషను సాధించు పాణినిసూత్రాలకీ కావ్యం ఉదాహరణం) అని కవి ఆదిలోనే చేయెత్తి చెప్పేరు.

సువర్ణ కంకణం కట్టుకున్న చేయెత్తి ఒక దృఢప్రతిజ్ఞ చేసి, (శ్రీ) దాసకవి కావ్యాన్ని ఆరంభించేరు. "ఈ కావ్యంలో కేవలం పాదపూరణం కోసమని వ్యర్థంగా ఏ పదమూ ఉండదు. ఉపసర్గకుగాని, తత్సమానమైన దానికిగాని పునరుక్తి లేదు. ........................
................భిన్నలింగవచన సాదృశ్యం చూపబడలేదు ......
................లోకాతీతమైన అర్థాన్ని చెప్పే శబ్దం లేదు... ...
...... ........అవైదికమైనవాటి నూతాలకిది ఉదాహరణము."
ఈ ప్రతిజ్ఞను ఆయన అక్షరాలా అమలుపరచేరు. ఏ మహాకవి కయినా ఇటువంటి ప్రతిజ్ఞ సాధ్యమయ్యిందా! అవుతుందా! అది ఆయనకే చెల్లింది— సరస్వతీమూర్తి గనుక! దాసుగారికి సంస్కృతమంటే సాటిలేని ప్రేమ - గౌరవమున్నూ. కనుకనే "సా దేవభాషాఖల లోక

కట్టినట్లుగాను వర్ణించబడింది మూడవ సర్గలోని నౌకాయాన వర్ణనం లోకోత్తరమైన ఉపమో త్ప్రేక్షలతో ముచ్చటగొలుపుతూఉంది. చంద్రమతీనగర వర్ణనము, అక్కడి జనుల స్వరూప స్వభావాది వర్ణనమున్నూ స్వభావ సుందరంగా ఉన్నాయి. నాలుగవసర్గ అంతా పద్యానికి కొక వృత్తంగా నడిచింది. ఉపస్థిత, మత్త, చంద్రలేఖ, లక్ష్మి క్రౌంచపద, శ్యేనిక, శంభునటనం, తన్వి, మొదలయిన ఇరవై కొత్త వృత్తాలు ఇందులో విహరించేయి. ఇవి ''కనీవినీ ఎరుగనివి''గా తోస్తూ కవియొక్క ఛందస్సారాన్ని ప్రకటిస్తాయి. తారక రాజపుత్రులు చక్రవర్తి మైత్రిని సంపాదించడం, చక్రవర్తి శత్రువులతో వారు పోరాడి జయించడం, చక్రవర్తి భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రసాదించడం మొదలయినవి ఇందులోని విషయాలు. విషయానుగుణంగాను, రసానుగుణంగాను శబ్దార్థ సంఘటనసాగి, కవి ప్రతిభకు నివాళులు పట్టిస్తుంది ఈ సర్గ. అయిదవసర్గ ఉపసంహారం. చక్రవర్తి కన్యాదానమూ, రాజ్యదానమూ కూడా జరిపిస్తాడు. రాజపుత్రుడు ఉభయాన్నీ స్వీకరించితిరిగి తన దేశం చేరుకుంటాడు. తారకుడు భారత తారకుడై, కుటుంబిఅయి శుద్ధశ్రోత్రియుడుగా జీవనం సాగిస్తాడు. ఈ సర్గ పూర్తిగా ద్రాక్షాఫల సదృశంగా నోరూరింపజేస్తుంది. నారాయణదాస, విజయనగర నామ గర్భితమైన చక్రబంధంతో కావ్యం స్వస్తిపలుకుతుంది.

పైపైని తారకం కల్పితకథాకావ్యంగా గోచరిస్తుంది. కాని అంతర్గతంగా ఇది స్వకీయచరిత సంవలితమైన చరిత్రకావ్యం. అన్యాపదేశంగా తన జీవితచరిత్రను ఇందులో రంగరించేరు శ్రీ నారాయణదాసుగారు. వారి చరిత్ర పూర్తిగా తెలిసినవారికే ఈ అంశం అర్థమవుతుంది. "సువర్ణముఖీనది – అజ్జాడ అగ్రహారం – శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబం – దివ్యప్రభావంతో దాసుగారి జననం – బాల్యంలో వారి అద్భుతకృత్యాలు – పాండిత్యపరీక్ష – విజయనగరం – రాజకుటుంబంతో పరిచయం" – మొదలయినవి సంనిహితులకు అడుగడుగునా

చక్కగా స్ఫురిస్తునే ఉంటాయి. విదేశగమనాదులు కొన్ని భావనా తరంగాలు. శ్వేతద్వీపం అంటే "ఇంగ్లండు" దేశమనీ, చంద్రపురి అనగా "లండన్" నగరమనీ, చంద్రకాంతానది "థేమ్స్"నది అనీ, సమాజవర్ణన బ్రిటీషు పౌరుల వర్ణన అనిన్నీ ఎవరికయినా - చెప్పకుండానే - ఇట్టే తెలిసిపోతుంది. ఇక దాసమహాకవి వ్యక్తిగతమైన ఆశయాలు, ఆదర్శాలు, రాజకీయమైన, సామాజికమైన, సాంస్కృతికమైన, శాస్త్రీయమైన భావాలు, అభిరుచులున్ను కావ్యంలో గజిబిజిగా అల్లుకుని కొన్నిచోట్ల గూఢంగాను, మరికొన్నిచోట్ల ప్రకటంగాను దర్శనమిస్తాయి,— "అద్వైతమే తత్త్వచింతామణి - వేదమార్గమే రాజమార్గం - బ్రాహ్మము, క్షాత్రము - ఈ రెండే సనాతనంగా సకల శ్రేయస్సాధకాలు (జ్ఞానవిజ్ఞానాలకు ప్రతీకం బ్రాహ్మం. తేజః పరాక్రమాలకు ప్రతీకం క్షాత్రం) భారతదేశంలో ఒకప్పుడు గ్రామాలు, నగరాలు సర్వవైభవాలతో కలకలలాడుతూ ఉండేవి- అవిప్పుడు బాగా పాడైపోయేయి - అవి బాగుపడాలి - సమాజం పునరుద్ధరింపబడాలి- భారతదేశానికి స్వాతంత్ర్యం సంపాదించాలి. అప్పుడే అన్నీ సమకూరుతాయి - చక్రవర్తికి అనుగుణంగా ఉండి సహాయంచేసి స్వాతంత్ర్యం పొందడమే మంచిది - బ్రిటీషు సమాజం అన్నివిధాలా మహోన్నతంగాఉంది - ఆవిధంగానే భారతసమాజం కూడ ఉంటే ఎంత బాగుండును! క్షాత్రమే రాజ్యమేలాలి-బ్రాహ్మం మాత్రం తత్త్వప్రతినిధిగా కారకంగానే ఉండిపోవాలి"— ఇవీ భావవీచికలు, ఇందులో కొన్ని ఈనాడు ఎబ్బెట్టుగా తోచవచ్చు. కాని క్రీస్తుశకం ఇరవయ్యో శతాబ్ది ఆరంభములో ఈ భావాలు ఎంత సహజమైనవో చరిత్రకోవిదులకు స్పష్టం అవుతుంది (కావ్యరచన క్రీ. శ. 1910 ప్రాంతమని గుర్తుంచుకోవాలి). వీటిని గురించి తర్జనభర్జనలు జరపడం నేడు అప్రస్తుతం - అనుచితం. "టేబిలు మీల్సు" పుచ్చుకుంటున్న యువకుడు తమ తాతగారి దేవతార్చనను ఆక్షేపించడం అనుచితం

కాదా! కాగా ఇటువంటి మహాకావ్యాన్ని సంతరించిన మహాకవికి 'నమోవాకం ప్రశాస్మహే'.

వ్యాఖ్యాత శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారు :— "బ్రాహ్మీభూషణ" బిరుదాంకితులు - కవిపండిత శిరోమణులు— సాహిత్యసారసర్వజ్ఞులు - పురాణప్రవచన శౌండులు—వావదూకాగ్రగణ్యులు - సత్యనిష్ఠులు - ఆత్మగుణసంపన్నులు. వీరి కవితాపాండిత్య ప్రకర్షను, గుణసంపదను గుర్తించి సహృదయలోకం వీరిని సౌవర్ణమైన "గండపెండెరము"తోను కనక కుండలాలతోను సత్కరించింది. ఇందుకు మించి వీరి యోగ్యతను చెప్పడ మెందుకు? ఇదివరకే వీరు పెక్కు రచనలు చేసి, "సెబాసు" అనిపించుకున్నారు. ముఖ్యంగా కాళిదాసుని నాట్యనాటకాలను సర్వాంగసమంగా తెలుగులోనికి అనువదించారు. మురారి నాటకాన్ని పద్యంగా ఆంధ్రీకరించారు. ఆంధ్రశబ్ద చింతామణికి ఆంధ్రలో వ్యాఖ్యవ్రాశారు. సాహిత్య వ్యాసాలను శతశః ప్రకటించారు. ఇటువంటి శ్రీ శాస్త్రిగారు ప్రకృతం తారకమహాకావ్యానికి సంస్కృతవ్యాఖ్యను తెలుగు తాత్పర్యాన్నీ రచించేరు. "సాధారణోభూషణ భూష్యభావః" అన్న కాళిదాసుని వలెను, ఇక్కడ మూలవ్యాఖ్యా గ్రంథాలకు సమంగా సరిపోయింది. నాంతరీయకంగా నా విషయం కొంచెం చెప్పవలసిఉంది. శ్రీ శాస్త్రిగారికిన్నీ నాకున్నూ సుహృదయానుబంధము, సహృదయానుబంధము, సారస్వతానుబంధమున్నూ సుచిరంగాను, అనన్యసాధారణంగాను ఏర్పడిఉంది. అందువల్ల ఆయన సాహిత్యవ్యాసంగాన్ని సామాన్యంగా నాకోసారి చూపడం, నేను మెచ్చి "బుర్ర ఊపడము"న్ను పరిపాటి. అదే తీరులో తారక వ్యాఖ్యను సాకల్యంగా చదువుమనీ, కలహాలిమ్మనిన్నీ" వారు నన్ను కోరడం జరిగింది. అదీగాక 'అల్లుల్లో మల్లుపెద్ద' అన్నట్లు, నవీనవైయాకరణుల్లో నాకొకస్థానం వచ్చింది. తారక కావ్యం విషయంలో వైయాకరణుల అవసరమున్నూ చాలాఉంది. కాగా నేను వ్యాఖ్యానాన్ని ప్రత్యే

ష్కరము చదవడమున్నూ, 'కొరకరానికొయ్య' వంటి కొన్ని ప్రయోగాల విషయంలో నాకు తోచిన గుహాలను చెప్పడమున్నూ జరిగింది. ఈ అవకాశం కలిగినందుకు నాకున్నూ ఎంతో ఆనందం కలిగింది. ఘుమఘుమలాడుతున్న కుంచెడు బియ్యం పులిహోరకు కొంచెం కరివేపాకు అందించినట్లు' సంతృప్తి కలిగింది. 'అమర్చిన దాంట్లో అత్తగారి చెయ్యి' అనే సామెతకూడా గుర్తుకువచ్చి నవ్వుకున్నాను, సరే - దానికేమి!

ఇందులో ప్రతిశ్లోకానికిన్నీ మృదుమధురమైన సంస్కృత భాషలో వ్యాఖ్యానము - తాత్పర్యమున్నూ—చివరను ముచ్చటయిన తెలుగులో తాత్పర్యమున్నూ, కూర్చబడినాయి. వ్యాకరణాలంకారచ్ఛందో విశేషాలు అవసరమైనంతవరకు సూచనగా చోటుచేసుకున్నాయి. విమర్శలు, వాదోపవాదాలు, శాకదంత పరీక్షలున్నూ— పూర్తిగా కాలానుగుణంగా విడువబడినాయి. ఈ కాలంవారికి అవి సహించవుగదా! మొత్తం మీద వ్యాఖ్యానం సహృదయరంజకంగాను బాలప్రౌఢ సామాన్యంగాను, సముచితంగాను సాగించడంలో సందేహంలేదు. ఇది నా సంపూర్ణానుభవం.

ఇక ప్రోత్సాహకర్త (శ్రీ) శర్మ ఈశ్వరరావుగారు:— (శ్రీ) నారాయణదాసుగారికి దగ్గరబంధువు. (అల్లునికి అల్లుడు), దాసభారతికి ఆత్మబంధువు వాణిజ్యవిశారదులయినా వాణీవిశారదులు కూడా; సహృదయ చక్రవర్తి, సరస్వతీపరివస్యాయందాసక్తి గలవారు. అందువల్లనే "దాసభారతీ ప్రకాశన మహాసత్రయాగానికి దీక్షితులయ్యారు. సంవత్సరాలతరబడి నిర్విరామంగా దాన్ని జరిపిస్తున్నారు. తగిన ఋత్విక్కులను వరించి, శాస్త్రోక్తంగా సంపాదించి, లోపాలులేకుండా చూచుకుంటున్నారు. మహాయజ్ఞం పూర్తికావస్తున్నది. అవభృథం సమీపిస్తుంది. అందులో ఒక భాగమే ఈ తారకవ్యాఖ్య. నేనుకూడా

(శ్రీ) దాసుగారి 'జగజ్జ్యోతి'ని సంస్కరించి సారస్వతనీరాజనములో తారకాన్ని సమీక్షించి ఈ అవతారకము రచించి, ఏదో కొంత ఆర్త్విజ్యాన్ని వహించేనని చెప్పడానికి గర్విస్తున్నాను- 'ఆచార్య' యస్. వి. జోగారావువంటివారు 'అధ్వర్యుల'యితే, మావంటివారు 'ఉద్గాతలు' కావడం పరిపాటి. అదే జరిగింది. ఇదంతా జరగటానికి నిదానం (శ్రీ) ఈశ్వరరావుగారి ప్రోత్సాహం అది లేకపోతే యజ్ఞమూ లేదు-ఋత్విక్కులూ లేరు. 'నిరాలంబా దాన సరస్వతీ' అయిఉండేది. 'ఈశ్వరుని సామర్థ్యం' అందరికీ ఉంటుందా - మరి!! కాగా (శ్రీ) ఈశ్వరరావుగారు సర్వదా సర్వథా సహృదయుల అభినందనాలకు ఆశీస్సులకున్నూ అర్హులు.

చివరగా — ఒక నారాయణుని మూలమూ, మరొక నారాయణుని వ్యాఖ్యానమూ (అద్వైతంగా భావిస్తే మరీమంచిది), కలిగిన ఈ తారకమహాకావ్యం, ఈశ్వరప్రేరితమైన 'అవతారకము'తో కలిసి 'ఆ చంద్రతారకము'గా ప్రకాశించాలని నా ఆకాంక్ష. 'తథాస్తు'

సహృదయసేవకుడు

విశాఖపట్నం-13
24-8-1983

అప్పల్ల సోమేశ్వరశర్మ

ఇంటి అడ్రస్ :

డి. నెం. 50-96-8/ఎ
టి. పి. టి. కాలనీ, సీతమ్మధార
విశాఖపట్నం-13,
పిన్. నెం. (530013)

# పీఠిక

## శ్రీ గురుమూర్తయే నమః

ఇత్యాది "తారకమ్" అను పేర సంస్కృత శ్రవ్యకావ్యము. ఇందు అయిదు సర్గలు. ఒకటి రెండు తక్కువగా మూడువందల శ్లోకములు గలవు. జగద్విఖ్యాత యశస్కులైన శ్రీ మదజ్జాడాదిభట్ట నారాయణదాస మహాకవి శేఖరులు రచించిన దీకావ్యము.

బంగారమునకు బరిమళమబ్బినట్లు- రచయిత హృదయము నపూర్ణముగా నవగాహించుకొని సంస్కృతమున నొక వ్యాఖ్య, తెలుగున నొక వ్యాఖ్య రచించినవారు పండిత శిరోమణి; బ్రాహ్మీభూషణ బిరుదాంకితులగు బ్రి. శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణ శాస్త్రిపర్యులు.

నేటి మన కీకావ్య మపూర్వమైనది. క్రీ॥ శ॥ 1910 సంవత్సరము నాటికే నాగర లిపిలో ముద్రితమై మూలమాత్రమే జర్మనీ దేశమునకు పయనించి మార్బుర్గు యూనివర్శిటీయందలి సంస్కృత భాషా ప్రాచార్యుడగు గెల్డనర్ పండితుని ప్రశంసల నందుకొన్నది. సర్వవిధములనంతటి మహోత్కృష్టమైన ఈ కావ్యము మన మీనాటికి కనులారఁ జూచి, చదువుకొని యాశ్చర్యానందముల నొందుటకు హేతువు నిస్వార్థ బుద్ధితో శ్రీనారాయణదాస సారస్వత మంతయు నాంధ్రమాతకు పూజోపహారముగా సమర్పించుకొను మహోద్యమమునకు నడుము కట్టిన బ్రహ్మశ్రీ కరారి ఈశ్వరరాయ మహాశయుల సంకల్ప బలము, ఆయన సఫలీకృత మనోరథులైనారు. అది యాంధ్రుల మగు మన యదృష్టపరిపాకము.

ఇట్టి యపూర్వ సంస్కృత శ్రవ్యకావ్యమును రచించినవారు మహాంతర్వాణి మహాకవి మహాగాయక శిరోరత్నము సంస్కృతాంధ్రాంగ్ల

పాంకి కోటి బహుభాషా భాండాగారము నైన శ్రీ ఆదిభట్ల నారాయణ దాసుగారిని.

“నారాయణదాస జయంతి సందర్భమున” ఆచార్య, కళా ప్రపూర్ణ విద్వాన్ శ్రీ గంటి జోగి సోమయాజులు గారు దాసుగారిని గూర్చి వ్రాసిన వాక్యము వివిధ లోకములలో మహావిద్వాంసుం డెవ్వఁడు? తెనుఁగున దిట్ట, సంస్కృతమున స్రష్ట, సంగీతమున సమ్రాట్. వింత వింత నృత్యములతో విరాట్టు, కన్నడము, ఉర్దూ, ఆంగ్లము పారసీకము అరబీ భాషలలో, నేర్పు గలవాఁడు, కళాశాలాధిపుఁ డయ్యు, అఖిల భారతమున సంచరించినవాఁడు. ఒక్క మహారాజ పోషణలో నుండియు, వివిధ రాజాస్థానములలోను పేరుపడి గౌరవింపఁబడిన వాఁడును, ప్రాచీనకవులు ప్రారంభించిన ప్రాంత కావ్య ప్రక్రియలో సిద్ధుఁడైన వాఁడును, కేవల స్వీయప్రతిభతో అపూర్వ కావ్య ప్రక్రియను - సంగీతము సాహిత్యము నృత్యము మొదలైనవాని నన్నిటిని మేళవించి కల్పించినవాఁడు ఏవఁడైన నున్నాఁడా యని ప్రశ్నింప వచ్చు. ఉండినవాఁడు, శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు. తమ కావ్యరూపమున అజరామరులైన ఇతర కవీశ్వరులవలెనే ఆంధ్రదేశమున ఇతఁడు నేడును ఉన్నాఁడని చెప్పక తప్పదు” అని శ్రీనారాయణదాస మహాకవి కృతగ్రంథములు నలువదియాఱింటిలో ఈ “తారక” కావ్యమున కొక విశిష్టత కలదు. తక్కిన తత్కృతు లన్నియు భారత భాగవత రామాయణములకో, భక్తిప్రభావము లగు స్తోత్రగ్రంథములకో, ఏకో, భాషావిశేష బోధనకో, సంగీత సాహిత్య వ్యాకరణాది శాస్త్రములకో, భాషాంతరానువాదములకో సంబంధించినవి. ఇఁక నీ కావ్యమో యితివృత్తము, మొదలు సర్వమును స్వకపోల కల్పితమును, స్వదేశ స్వాతంత్ర్య సంపాదన ప్రవణమునై గోచరించుచున్నది

ఈ కావ్యము 1910 సంవత్సరమున ముద్రితమైనది. అంతకు పూర్వమే రచితమై యుండవచ్చును. లేదా ఆసంవత్సరమే రచనకూడ జరిగినను జరుగవచ్చును.

అప్పటికి మన దేశము బ్రిటీషుసామ్రాజ్యము చేతిలో అస్వతంత్రముగా నున్నది. అంతకు మున్నే శ్రీ "దాదాభాయి, నౌరోజీ" మున్నగు మహామహులు కాంగ్రెసు అనుపేర "జాతీయ మహాసభ" నేర్పరచి యేటేట దానిద్వారా తమ స్వాతంత్ర్య కాంక్ష బ్రిటీషు సామ్రాజ్య పాలకులకు విన్నవించుకొనుచుండిరి. లోకమాన్యతిలక్ప్రబుద్ధులు కొందఱు సంపూర్ణ స్వాతంత్ర్యము కావలె నని అతివాదు లనిపించుకొనిరి. గోక్లే ప్రభృతులు సామముచే స్వాతంత్ర్యము సంపాదింప యత్నించుచు మితవాదు లనిపించుకొనిరి. ఇది యంతయు 19-వ శతాబ్దితుదను, 20-వ శతాబ్ది మొదటను జరిగిన వ్యవహారము. తరువాత 1905 ప్రాంతమున బంగళాదేశమును బ్రిటీషుపాలకులు రెండుగా విభజించి, ప్రజలలో పెద్దకలవరము లేవ నెత్తిరి. దానినే బంగళాదేశపు నాయకు లగు" బిపిన్ చంద్రపాల్, అరవిందఘోషు మున్నగువారావిభాగమును ప్రతిఘటించుచు దేశము నలువంకలఁ దమకు జరిగిన అన్యాయమును ప్రచారముచేయ వందేమాతరమ్' అనెడి యుద్యమము లేవనెత్తి విదేశీయ వస్తుబహిష్కారము మున్నగు కార్యక్రమము లు నడిపిరి. ఆగాలి సోకి ఆంధ్రరాష్ట్రమునఁగూడ స్వాతంత్ర్యవాంఛ గల మహామహులు కొంద అతివాదులుగాను, పెక్కురు మితవాదులుగాను ప్రచారమునకుఁ దిగి, నాఁటి దొరతనముచే సాఫల్యము పొందలేక అయోమయ స్థితిలో నుండిపోయిరి.

అంతకుమున్ను మహమ్మదీయ పరిపాలనమున మహాబాధ లనుభవించిన ప్రజలు బ్రిటీషువారిపాలనమున చాపక్రింద నీరువలె ప్రాకుచున్న వైదేశిక నాగరకతకు వశులై, శాసన స్వాతంత్ర్యముతోపాటు

సకల భారతీయ ధర్మము లోపము దూరమై ఆకారమున మాత్రము హైందవులను, ఆలోచనలకు, ఆచార వ్యవహారములకు, మత సంస్కారములకు విదేశజులవలె నైపోయిరి.

అప్పట్లో - స్వదేశీయులలో అందును ఆంధ్రుల దుస్థితిని జూచిన శ్రీదాసుగారు మితవాద మార్గమున వాంఛాసిద్ధి కలుగునను విశ్వాసము కలిగి కావచ్చును. రాజకీయనాయకులవలెం గాక, తన కవితాశక్తిచే, దేశప్రజల నుద్బోధించి దేశ స్వాతంత్ర్య సంపాదనమునకు, నుపాయముగా, నీకావ్యము రచించినట్లు తోచుచున్నది.

ఈ కావ్య నాయకుం డగు తారకుఁడే నారాయణదాసుగారు ఘటించన్నది శ్రీకరమందలి 'అశ్రితకల్పక' మను నగ్రహారమే సువర్ణముఖీ నదీ తీరమందలి అజ్జాడ గ్రామము, అందుండెడి మహేశ్వరుఁ డను పండితుఁడే దాసుగారి తండ్రియగు వేంకటచయనులుగారు, ఆపండితుని భార్య పేరు చెప్పఁబడకున్నను, ఆమె గుణగణములకుఁ బ్రతిబింబమైన సరసమాంబయే తారకునితల్లి. తనభర్త నిత్యము పురాణము చెప్పుచుండ వినుచు నవి యెల్లరకు మరల బోధించుచు 'చదువులవ్వ' అనిపించుకొనిన విజ్ఞానవతి మంచి చరిత్రగల యాదంపతుల కనిష్ఠపుత్త్రుఁ డగు తారకుఁడే దాసుగా రన్నమాట- తారకుఁడు మాతృగర్భస్థుఁడై యుండ బ్రహ్మాది దేవత లందఱు వచ్చి దేవకీ గర్భస్థుఁడైన కృష్ణపరమాత్మను స్తుతించిన ట్లే- తారకుఁడు పుట్టిన వెంటనే దేవతలువచ్చి యాతనిని పరమాత్మగా స్తుతించినట్లు మాత్రము మార్చఁబడినది. సరసమాంబకు భాగవతము ఎక్కువ ప్రీతిపాత్రము. దాసుగారు గర్భస్థుఁడై యుండగా బ్రహ్మాది దేవతలు కృష్ణపరమాత్మను స్తుతించిన ఘట్టము, సంతతము నామె స్మరించుకొనుటచేతనో, పునఃపునః భర్తవలన వినుట చేతనో, కాలము పుచ్చుచుండెడిది యని ధ్వనిత మగుచున్నది. లేకున్న

తారకుఁడు పుట్టగఁనే దేవతలు స్తుతించుట సుసంగతము కా దనిపించు చున్నది.

"తారకుఁ" డనఁగా 1 తరింపఁజేయువాఁడు, కర్ణధారుఁడు 2 ఆపదల నుండి తరింపఁ జేయువాఁడు, అని అర్థము. దుఃఖమయమైన యస్వతంత్ర మగు భరతదేశమును తరింపఁజేయ బూనిన దాసుగారికి సూర్యనారాయణ నామము సరిపడినది. "తరణి" యన సూర్యుఁడు "తరంత్యనేన సంసారమ్ తరణిః" అనియు. తరణిర్ద్యుమణౌ పుంసి కుమారీ నౌకయోః స్త్రియాం అని యుండుటచేత తరణి తారక శబ్దములు పర్యాయపదము లైనవి. వేంకటాచలయ్యగారు సూర్యమంత్రోపాసకులును, శ్రీ నరసమాంబ అరసవిల్లి క్షేత్రమున వెలసిన సూర్యదేవుని నారాధించు నది. కావున సూర్యనారాయణుఁ డని నామకరణ మొనర్చిరట. దాసుగారు కూడ అరసవిల్లి సూర్యనారాయణ శతకముఁ జెప్పి యున్నారు.

త్రిమూర్త్యాత్మకుఁడును, వేదత్రయస్వరూపుఁడు నగు సూర్యదేవుఁడే దాసుగారు — అని నా యాశయము.

పుట్టిన పిదప తారకుని బాల్యచేష్టలు తదుభయుల భావి జీవితములకును పునాదులుగా దాసుగారి భావనాబలమున స్వభావసిద్ధ మైనట్లు సృష్టింపఁ బడినవి.

పిదప ఉపనయనము, పౌరాణిక పతంగులగు దశు తండ్రులే గురువులుగా సకల విద్యలకును శిక్షాపాఠము జరిగినది. మేరు సమ ధీరుఁడును స్వతంత్ర శక్తి గలవాఁడు నగు తారకునకు పరదేశములను చూడఁ గోర్కె గలిగి "విబుధనగరము" చేరెనంట. దాసుగారును ఉపనీతులై వేదము కొంచము నేర్చి తండ్రిగారివలన సంస్కృత సాహిత్య గ్రంథములు కొలదిపాటి చదివి విజయనగరమున న్యాయ

వాదిగా నున్న అన్నగారి యొద్దకు వెళ్లి యచట ఆంగ్లకళాశాలలో ఎఫ్. ఏ. పర్యంతము పఠించుట మున్నగునవి ధ్రువములగుచున్నవి. అచ్చట మేధావి యగు తారకుఁడును సకల విద్యలను గురువుల యపేక్ష లేకయే గ్రహించినాఁడట. ఆ పట్టణమునఁదలి జ్ఞానవృద్ధుఁ డగు నొక వయోవృద్ధునివలన అంతకు పూర్వ మా పురజనము నచటి భూపాలకుఁడు నెంత ధర్మమార్గమున నుండెడివారో వివరముగాఁ దెలిసికొనెనఁట తారకుఁ డాపట్టణ మంతయుఁ దానుఁజూచి, యీనాఁటికి నెట్లు మాఱి పోయినవో తెలిసికొని పరితాపము నొందినాఁడఁట. నాల్గు వర్ణముల వారును స్వధర్మ దూరులై కన్యా శుల్కాది దురాచార పరాయణులై పోయిరే యనుకొనుచు, రాజోద్యానము చేరి నాఁటి దేశదుస్థితి నొక గేయముగా రచించి, యొక చెట్టుక్రిందఁ గూర్చుండి గొంతెత్తి పాడి నాఁడు. ఆచ్చటికి సమీపముననే రాజప్రాసాదమున నున్న విబుధపుర రాజకుమారుఁ డాగానమునకును, కవిత్వమునకును పరవశుఁడై తార కుని తన భవనమునకు వచ్చుటకు సేవకులచే గుఱ్ఱము నంపెను. తార కుఁ డాగుఱ్ఱము నెక్కి రాజకుమారుని కలిసికొని యతని ప్రేరణమున మహారాజును దర్శించెనఁట.

ఈసందర్భము - దాసుగారు సంగీత సాహిత్యములందు నిష్ణాతుఁడై హరికథా కథన నైపుణ్యముచే నాంధ్రదేశమందే కాక కర్ణాట దేశ మైసూరు చేరి యచటి మహారాజుగారి యాదరణ ప్రత్యేక సకల సన్మానములకు భాజనులైన కథ కిది స్ఫోరకముగా నీవాక్యమున ఘటింపఁబడినది. రాజపుత్రునిచే మహారాజసన్నిధికిఁ గొంపోబడిన తారకుఁడు తన సకల విద్యాపాటవమున సత్కృతుఁడై యువరాజుతో బద్ధమైత్రి గలవాడయ్యెను. దేశముయొక్క పారతంత్ర్యమును గూర్చి యిరువురును సుదీర్ఘముగాఁ జర్చించుకొని, చంద్రద్వీపమున నున్న సార్వభౌముని దర్శించి స్వదేశమునకు స్వాతంత్ర్యము సంపాదించవలె నని దృఢనిశ్చయు లైరి.

ఇంతదాఁక - ఆ శ్మశానముగా నీవృత్తాంతము ధ్వనించుచు యెంతయో రమ్యతరముగా నున్నది. తారక రాజపుత్రుల యీసంకల్పము నాఁటి మితవాద నాయకుల తీవ్రయత్నములకు సూచకంగాఁ గనవచ్చుచున్నది. అతివాదులును విప్లవవాదులు నగు లోకమాన్య ప్రభృతులును సావర్కారు సోదరులును బ్రిటీషువారి నెదిరించి, వడ కాని శిక్షలకు పాలై యేమియు సాధింపఁ జాలక పోవుట చూచి కావచ్చును. దేశాభిమాన పూరిత హృదయు లగు దాసుగారు భంగ్యంతరముగా మితవాద మార్గమున కొకనుగమమగు మార్గమును చూపఁ దలఁచి తారక రాజపుత్రుల విదేశయాత్ర ముందుగా కల్పించిరి. బ్రిటీషుచక్రవర్తిని దర్శింప ఇంగ్లాండునకు వెళ్ళవలెను గాన దానికై ముందుగా నౌకాయాత్ర కల్పిత మయ్యెను. ఆయన యేదే నొకసందర్భమున ఓడప్రయాణము చేసినారో లేదో తెలియదు. కాని మహాకవి గావున చూచినట్లే వర్ణించినారు.

సంకుపాల నృసింహకవి తన కవివర్ణ రసాయనమున సత్కవులఁ గూర్చి యిట్లు చెప్పెను.

చ. మనమునఁ గొన్ని నెవ్వగలు మాన్ప ఘటింతురు కావ్యసమ్మదం
బనఘ కథాముఖంబున హితాహిత బోధ మొనర్తురింపుగా
గనుఁగొనుకంటె నద్భుతముగా నెఱిఁగింతు రతీంద్రియార్థముల్
ఘనమతు-లెల్ల వారికి నకారణబంధులుగారె సత్కవుల్.

అని దాసుగారు ఘనమతులం గావున నింద్రియములకుఁ గోచరింపని పదార్థములను గూడఁ జూచిన దానికంటె నద్భుతముగా వర్ణించినారని నాయూహ.

తారక రాజపుత్రులు నౌక నెక్కిరి. ఆ మోడ తెలుఁగువారి యోడ కాదు. అది స్టీమరు. ముందుగా కొడి లె కూఁత వేసినది. అది

విని యాత్రికు లందఱును నోడ నెక్కిరి. ఓడ బయలుదేరినది. పొగ చిమ్ముచున్నది యాత్రికులకు పరదేశ మెప్పుడు చూతుమా అని యాత్రము కలిగినది. నౌక వేగముగా నడచుచున్నది. ఓడవాండ్రును ప్రయాణికులును హాయిగా నున్నారు. తిమింగిలాదిజంతువులు కనఁబడు చుండెను. నీటిని చీల్చుకొని నౌక వెళ్ళుచుండ సముద్రము రెండు పాయ లైనట్లుండెను. యాత్రికులు భోజనాదికము తలఁచుకొనుచు నొకరితో నొకరు చెప్పుకొనుచుండిరి.

దిశలు మారినట్లయ్యెనట. త్రాగుటకు తెచ్చుకొనిన మంచినీరు నేయివలె అతి మితముగా వాడుకొనుచుండిరి. యాత్రికులు రుచి నెంచక యన్నమును దినుచుండిరి. అంతట భయంకర మైన యెదురుగాలి వీవ దొడఁగెను. నావికుఁడు గాలికి భయపడుచున్న యాత్రికులను ఇంటి యరుగున నుండెడి కోళ్ళగూటిలోనికి కోళ్ళను ప్రవేశపెట్టినట్లు ఓడలో పలి భాగమున ప్రవేశపెట్టెఁనట. క్రమముగా కొంతసేపటికి గాలి తగ్గెను. ప్రమాదము తప్పి నౌక పూర్వమువలె వేగముగా పోవుచుండెను. యాత్రికులు సంపదలు పొందిన దరిద్రులవలె, ఆరోగ్యము పొందిన రోగులవలె నిర్భయులైనారు. అంత నొకనాఁటి ప్రాతఃకాలమునకు గమ్యస్థానము కనఁబడ, తారకుఁడును రాజపుత్రుఁడును, ధూమనౌక (స్టీమరు) నుండి యొక పెద్ద పడవ నెక్కి యాత్రికులతో పాటు ఒడ్డెక్కిరి. ఇది నౌకాయాత్రఁ స్వానుభవ మున్నవారైనను దాసుగారివలె ఏచిన్న యంశమును విడువకుండఁ జెప్పఁగలరా! అవర్ణనము నిరుపమానము అనన్యసాధ్యము.

తరువాత నాచంద్రద్వీప వాసుల యుత్తమోత్తమమైన యాచార వ్యవహారములు, వారి యాదరమును బహువిధముల వర్ణింపఁబడెను. ప్రజల మచ్చికచే నాచంద్రద్వీపమునందలి సార్వభౌముని వలన తారక రాజకుమారులు అమితాదరము నొందినారు. "మీ సామ్రాజ్యములోని

మా దేశమునకు స్వాతంత్ర్యము - కావలె నని కోరుటకే తాము వచ్చి
నట్లు విన్నవించిరి. తారక రాజపుత్రుల శౌర్య ధైర్య సాహసములకును
వారి సకలవిద్యా పాటవమునకును మెచ్చుకొని, రాజసభా ముఖమున
వారిద్దఱను సేనాధిపతులుగా సార్వభౌముఁడు నెలకొల్పిన అప్పటికి నా
సార్వభౌముని సోదరుఁడు శత్రువులచే చెఱపట్టఁబడినట్లు చెప్పుటతో
తడవుగా వారిద్దఱును సేనలతో వెడలి ఆధునిక యుద్ధపరికరములు
అనఁగా జలాంతర్గాములు తుపాకులు మరఫిరంగులు, బాంబులు
మున్నగు వానిని గొని శత్రుసైన్యముల నాశన మొర్చి అంతమున్న
శత్రువులతో పోరాడి క్షతగాత్రుఁడై మూర్ఛలోనున్న సార్వభౌముని
సోదరుని జేరిరి. తారకుఁడాయనకు వైద్యముచేసి కన్ను తెఱపించి,
పథ్య పానాదులచే స్వాస్థ్యము కలిగించెను. ఆ సందర్భమున శరీర
శాస్త్ర మంతయు వర్ణింపఁబడెను. అది దానుగారి ఆయుర్వేద విజ్ఞానము
నకు కరదీపికగా వెలసినది.

తరువాత తారక రాజకుమారులు చక్రవర్తి సోదరుని వెంటఁ
బెట్టుకొని చంద్రద్వీపమునకు వచ్చి చక్రవర్తిని సంతుష్టు నొనర్చిరి. ఆ
సందర్భమున దుర్భిణీయంత్రము వర్ణితము. సార్వభౌముఁడు తనసోద
రుని వలన వారియపూర చాకచక్యమును యెంతయు మెచ్చుకొని, వారి
కభీష్టమైన భారతదేశమునకు స్వతంత్రపరిపాలన వర మొసంగెను.
మరియు నా దేశమునకు పాలకుఁడుగా విబుధనగర రాజకుమారునే నిర్ణ
యించెను. తారక రాజపుత్రులు మిక్కిలి ఆనందించిరి. అంతట చక్ర
వర్తి పెండ్లికి సిద్ధముగానున్న తన పుత్రికను రాజకుమారునకిచ్చి పెండ్లి
చేసెను. పెద్ద విమానముమీఁద వారి నందఱను తనతమ్ముని సాయ
మిచ్చి విబుధపురమునకు పంపెను. సార్వభౌముని సోదరుఁడును రాజ
కుమారుని భారత రాజ్య పాలకుఁడుగా పట్టాభిషేక మొనర్చెను. అంతట
తారకుఁడు సంతోషముతో రాజకుమారిని శిరస్సున తన చేతితో కిరీటము

నెలకొల్పి దీపించెను. దేశమునకు స్వాతంత్ర్యము వచ్చెఁగదా అని తృప్తిపడెను. సార్వభౌముని తమ్ముఁడు స్వదేశమున కేఁగెను.

కారకుఁడును సకల సౌభాగ్య లక్షణావళి యగు నొక యుత్తమ బ్రాహ్మణ కన్యను పెండ్లాడి, ఆ భారతనాయకునివలన మహోన్నతములగు పారితోషికములఁ గొనుచు - ప్రాణప్రద మగు మిత్రుఁడై స్వతంత్రుఁడై సుఖముగా నుండెను. ఇది కారక కావ్యమునందలి యితివృత్త సంగ్రహము. ఆ యితివృత్త మంతయు శ్రీ లక్ష్మీనారాయణ శాస్త్రిగారు వ్యాఖ్యానించియే యున్నారు. కావున దాసుగారీ కావ్య రచనమునకు కారణముగా నాచెప్పిన దేశస్వాతంత్ర్య పిపాసకు ద్యోతకములగు దాసుగారి రచన నుండియే తెల్పెదను.

కారకుఁడను అనఁగా - దాసుగారేకదా! ఆతఁడు మొట్టమొదట

శ్లో॥ "అమల లలితరూపః సర్వవేదః, ప్రశాంతః
కలజనసమభావః సర్వతంత్ర స్వతంత్రః
జిత సమవయస్కః విద్యయా సద్యశస్కః
ప్రబలమత వరదే కారకో నందితి కుమారః.

కుమార వయస్కుఁడైన కారకుఁడు - సాటిలేని రూపము గలవాఁడు, సర్వము తెలిసినవాఁడు, - శాంతస్వభావుఁడు - అందఱియందు సమభావము గలవాఁడు. సర్వతంత్రములందు స్వతంత్రుఁడు, విద్యచే తన యీడువారిని మించినవాఁడు పేరొందినవాఁడునై పరదేశములను చూడ నభిలాష గలవాఁడాయెను.

స్వగ్రామము విడిచి విబుధవు ... - ...
... భారతదేశము శోభించుచు ...—

శకాధీశ్వరో భాగవై శ్వర్య మావత్,
జగో నాన్యదుఃఖం వినై వస్య సౌఖ్యం.

అనఁగా - శకాధీశ్వరుఁడు (తురుష్క ప్రభువో, అట్టివాఁడో) కులస్త్రీలను ఎత్తికొనిపోవుచు, బ్రాహ్మణులను నిందించుచు, దేవాలయములను గూల్చివేయుచు, పట్టణములు కాల్చివేయుచు, ప్రభుత్వము సాగించుచున్నాఁడఁట ప్రజలు సౌఖ్యము నెఱుఁగక సర్వదా దుఃఖమును పొందుచున్నారఁట. ఇది బహుశః ఆనాటి ఉత్తరహిందూస్థాన దుఃస్థితి కావచ్చును.

విబుధపురము చేరినపిదప అచటి వృద్ధులవలన ఆంధ్రదేశము, అందును ఆవిబుధపుర రాజుల పరిపాలనమున ప్రజలు పొందిన సౌఖ్యము ధర్మము, సత్యము, వర్ణాశ్రమ ధర్మనియతి, పూర్వమెట్లుండెడిదో విని తారకుఁ డెంతయో మొదట ఆనందించెను.

శ్లో॥ శ్రుతి నిగదిత మార్గం నాజహో న్నిర్విశేషం
దృఢ మిహ పరపద్యాం న హ్యవాలంబ తాఽయం
అనుమత బహు దుఃఖం నో సుఖం మానవోఽద్య
పరిభృత ముపకతం దుర్వ్యాప్త ఉన్మత్త చిత్తః-" 4-82

అచ్చట జనుఁడు వేదవిహిత మార్గమును పూర్తిగావిడువలేదు పూర్తిగా విదేశీయుల మార్గము నవలంబింపలేదు. దుర్వ్యాపారములలో, పిచ్చివానివలె నైపోయి ఏదిసుఖమో ఏదిదుఃఖమో కూడ తెలిసికో లేకున్నారు. అప్పటి దేశస్థితియన్నమాట. వారినిజూచి జగత్తంతయునిట్లే యున్నది, కావున నెట్లయినను యుపకారముచేసి యుద్ధరింపవలెనని ఉదారుఁడగు తారకుఁ డనుకొనినట్లు "స జగ దుపచికీర్షు స్తర్క యన్ న్నమ్యదాగః" అని చెప్పఁబడెను. అప్పుడు కర్మభూమియను మన దేశమునుద్దేశించి-

శ్లో॥ జనని! తవ జనోఽ తిక్రమ్య వేదోపదేశం
ప్రతిదిన మచరత్ స్వచ్ఛంద హీనో హాకాశః

ఇతి ముహు రభవ త్స్వాం సుప్తు రోరుద్యమానా
ద్విజ నినద విలాపైః సంధ్యయోః కర్మభూమే.

అమ్మా! ఓ కర్మభూమి! నీపరిజనులు వేదోపదేశము విడనాడి "స్వేచ్ఛ యొందును లేనివారై ఆశ లడుగంట సర్వదా ప్రవర్తించుచున్నారు." అని రెండు సంధ్యలయందును కూసెడి పక్షులకూత లనెడి యేడ్పులచే నాటి నాటికి గట్టిగా విలపించుచున్నావు"-

అనుచు బహు గుణ లలితముగా వాగ్గేయకారుడు కావున పెద్దగా పాడినాడు.

శ్లో॥ అభినవ రుచిరోహా చిత్రితత్యాగ వ్యక్తృప్తే, రపి సకల జనానాం
మోహకృద్ గానశక్తేః" 4-53

క్రొత్త క్రొత్తని యందమైన యూహాలతో కవిత్వము చెప్పుట వలనకంటె గానశక్తివలన సకల జనులకును మోహమును కల్గించెను. తరువాత "ప్రాతఃకాల వర్ణనము" అని చక్రవాకపక్షి దేశాభిమాని వలె పరికాళించెనని దేశాభిమానము వెల్లడించెను.

పిదప విబుధనగర రాజపుత్రుని స్నేహము మహారాజదర్శనము జరిగినపిదప ఆ రాజకుమారుడును తారకుడును-

"ముహు రభిజన యోగక్షేమ మాలోచయంతౌ" 4-56 తను జన్మనిదేశముయొక్క యోగక్షేమములను మిక్కిలిగా ఆలోచించినారు. తుదకు-

శ్లో॥ జగదధిపతి మన్వగ్భ్యాయ గోపాయతుం స్వే
బహువిదిత యువానౌ ప్రార్థ్యతౌ దేవదేవం,
న సుఖ మితి విదిత్వా స్వైరితా మంతరేణ
శోధిత దృఢమనస్కా వాప్నుతాం ధామనాకాం" 4-58

మిగుల జ్ఞానవంతులగు నాయుద్దఱు యువకులును, తమ్ము వెంట నంటియుండి రక్షించుకొనుటకైన జగదీశ్వరుఁడైన దేవదేవుని మనస్సునందు ప్రార్థించి దేశమునకు స్వాతంత్ర్యము లేనిదే సుఖము కలుగదని దృఢ నిశ్చయము కలవారై, తత్సంపాదనార్థము పొగరపోడ (చిన్నదేవును) చేరిరి-

ఈ శ్లోకములందు కవితాచమత్కృతి కొట్టవచ్చినట్లు సత్కృతి కనఁబడుచున్నను అంతర్వాహినిగా దేశస్వాతంత్ర్య సంపాదనశక్తి యుపాయాన్వేషము ముఖ్యముగా తోచును-

ఇది యానాఁటి రాజకీయముల ముచ్చట, ఇప్పుడట్టి బాధలు దొలఁగినవి. దైవకృపవలన స్వరాజ్యము వచ్చినది, కావున ఆ రాజకీయ వ్యవహారముల చింతనము కట్టిపెట్టి మహాకవి, మహాగాయకుఁడు, భాషామహాపండితుఁడు, హరికథా పితామహుఁడగు నారాయణదాస మహాశయుని సంస్కృత కవితాసరస్వతికి రత్నకిరీటమైన తారకకావ్యమునఁ గల శబ్దార్థ రామణీయకము హృదయముచే నాస్వాదింతము-

తారకము పంచసర్గ పరిమితమగు సంస్కృత శ్రవ్యకావ్యము అని ముందుగానే చెప్పియున్నాము 1, 2 హెచ్చొ తగ్గో - మూఁడు వందల శ్లోకములు గలవు. కావ్యాదర్శమున దండిమహాకవి.

"సర్గైరనతి విస్తీర్ణైః శ్రావ్యవృత్తైః సుసంధిభిః
సర్వత్ర భిన్నవృత్తాంతై రుపేతం లోకరంజనమ్"

అని కావ్యాదర్శమున కావ్యమందలి అవాంతర విభాగములైన సర్గములు అతివిస్తారముగా నుండరాదు. అందలి వృత్తములు శ్రావ్యములుగా నుండవలెను. ఇతివృత్తము విడిపోకుండ సర్గములన్నిటియందును కలసి వచ్చుచుండవలెను. ప్రతిసర్గాంతమునను వేఱువృత్తముండవలెను

అని చెప్పిన నియమమున కీతారక కావ్యము సరిపడియే యున్నది. కాని యీ సర్గముల సంయోజనమున దాసుగారి ప్రత్యేకత యొకటి లేకపో లేదు. ఆదికావ్యమైన వాల్మీకి రామాయణము మొదలు, కాళిదాస, భారవి, మాఘ, నైషధాది సకలకావ్యములందును వెనుకటిసర్గాంతిమ శ్లోకమునను, అనంతర సర్గాది శ్లోకములను, ఛందోవిషయమున సంబంధము కానరాదు. కాని యీ కావ్యమున నొక వైలక్షణ్యము కనంబడును.

1) సర్గమున :- అన్నియు ఉపజాతివృత్తములు, తుదిని మాలినీ వృత్తము

2) సర్గమున :- అన్నియు మాలినీవృత్తములు- సర్గాంతమున అనుష్టుప్ఛందము.

3) సర్గమున,- అన్నియు అనుష్టుప్పులే. తుదిని ఉపజాతివృత్తము

4) సర్గమున :- నానావిధ వృత్తములు తుదిని ప్రహర్షిణీ వృత్తము

5) సర్గమున :- అన్నియు ప్రహర్షిణీ వృత్తములే- తుదిని శార్దూల విక్రీడిత వృత్తము - చక్రబంధము (బంధకవిత్వముతో సమాప్తి.

ఒక్క నాల్గవసర్గమాత్రము విడిచి అన్నిసర్గములును ఆద్యంత శ్లోకములు శృంఖలాబద్ధము లగుట అపూర్వ సృష్టి.

చతుర్విధ కవిత్వములలో నొకటిగా నెన్నంబడు బంధకవిత్వము ప్రాచీనులైన భారవి మాఘ మహాకవుల కావ్యములందును, అర్వాచీనుడగు వేంకటాధ్వరి కృతమగు లక్ష్మీసహస్రకావ్యమునను కనంబడు చున్నవి. ఆంధ్ర కావ్యములందు పారిజాతాపహరణము, సరసభూపాలీయము మున్నగు వానియందు హెచ్చుగా గనంబడును. దాసుగారు అలోకవను గూడ తమ వైశిష్ట్యము చూపినారు-

ఇతి శబ్దార్థౌ మూర్తి రాఖ్యాతౌ - కావ్యసంపదః" అని కావ్యమునకు "శబ్దము, అర్థము" రెండును శరీర మనినారు లాక్షణి కులు- అర్థము మాట యటుండ దాసుగారు శబ్దమువిూద చేసిన సాము గరిడీలు అత్యద్భుతము- కావ్యారంభమున-

"స్వభావ పాండిత్యబలేన కుర్వే కావ్యం, - పత త్త్రి సహసేవసీడం" అని ప్రతిజ్ఞ చేసినారు. పక్షి స్వశక్తిచేత (ఇతరు లెవ్వరు నేర్పకయే) తన గూటినిపలెనే- నేను స్వభావసిద్ధమగు పాండిత్యశక్తిచేత నీకావ్య మును చేసికొనుచున్నాను - అని భావము.

ఇందు "సహసా, కుర్వే." అను రెండు పదములును అసామాన్య ములు- "సహసా, అనునది" అతర్కితము- అను నర్థముగల అవ్య యము కాదు, ద్రవిణం తరః సహో బల శౌర్యాణి స్థామ శుష్మంచ అను కోశమును బట్టి 'శక్తి' అను నర్థముగల సకారాంతమగు 'సహస్' శబ్ద తృతీయైకవచన రూపము- "స్వశక్తిచేత" అని దాని కర్థము- "కుర్వే" అను క్రియాపదము - ఆత్మనేపద[illegible]- క్రియాఫలము కర్తృ గామి యగుచో ఆత్మనేపదము ప్రయోజ్యము- అని సూచించుటకే ఆత్మనేపద రూపము 'కుర్వే' ప్రయుక్తమైనది- ఇట్టి రహస్యము లెం దందు కనఁబడుచుండును.

కావ్యరచనా రంభమున నాయన చేసిన ప్రతిజ్ఞావచనములలో- "ఈ తారక మనెడి గ్రంథమున నున్న శ్లోకములందు పాదపూరణమే ప్రయోజనముగాఁ గల "తు-హి-చ-స్మ-హ-వై" అను పదము లుండవు. ఒకటి రెండు మూడు నర్థ[illegible] [illegible] వరుసగా లఙ్, లఙ్, లిట్ క్రియాపదము లుపయోగింపఁబడినవి. రెండు మూడు నర్థములందు భూత కాలమును బోధించని క్రియాపద[illegible] లు లేవు. ఈ కావ్యము వైది కములు గానట్టి పాణినీయ సూత్ర[illegible] కుదాహరణములు" అని

భావము గల దానుగారి సంస్కృత కావ్యములకు రాంభట్ల పండితుల వారి అనువాదము.

ఆవిషయమునకు చేరువగా శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారు సంస్కృతవ్యాఖ్యయును, ఆంధ్రవివరణమునందును ప్రదర్శించుచునే వచ్చినారు. మొదటిశ్లోకమున సంస్కృత భాషా ప్రాశస్త్యము వర్ణింపఁ బడెను. అందు తమ యుద్దిష్టార్థము తెలుపుటకు మణోక ధాతువు ప్రయోగింపవచ్చును. కాని "పరిష్కరోతి" అను క్రియాపదమునఁ గల చిన్నవిశేషము చూపఁబడినది. "పరి+కరోతి" అను నెడ "సంపరిభ్యాం కరోతౌ భూషణే" అసూత్రముచే కృధాతువునకు సుడాగమము కలిగి "పరిష్కరోతి" అనురూప నిష్పత్తిని దెలుపుటకే ప్రయుక్తమైనది.

4-వ శ్లోకమున :- "అవాత్సీత్" అను పదము 'వస' ధాతు లుఙ్ ప్రథమపురుషైకవచనరూపము. "వస" ధాతువునందలి సకారము తకారముగా మారుట నొక వైచిత్రి "(సః స్యార్ధధాతుకే" సస్య తః స్యా త్సాదా వార్ధధాతుకే'' అను పాణినీయము దాని కాధారము.

5-వ శ్లోకము :- "ఉత్తపతే" అని ప్రయుక్తము వానికి 'ఉజ్జ్వలతాం కరోతి' అని వ్యాఖ్యానింపఁబడినది. "తప" ధాతువు భ్వాది, దివాది, చురాది గణముల మూడింటను వరుసగా 'వరుసగా దాహే, ఐశ్వర్యే, సంతాపే' అను నర్థములతో పరస్మైపదముగా నున్నది. ఆ తపధాతువే 'ఉద్విభ్యాం తపః" అను సూత్రముచే – ఉత్ వి' అను ఉపసర్గములకంటె పరమందున్న "తప" ధాతువు "ఆత్మనేపదము" అగుటయు. ఉపసర్గబలముచే దాహా ద్యర్థములు పోయి ప్రకాశించు అనెడి అన్యార్థము గూడ పొందినది.

3-వ సర్గము :- 'అసుఖ్యత్' అని కలదు- అది యొక విచిత్రమైన ధాతువు. "సుఖ దుఃఖ తత్క్రియాయాం" అను ధాతువులపై.

కంణ్వాది గణపఠితములు కావున "కంణ్వాదిభ్యో యక్" అను సూత్రముచే యగాగమము వచ్చి సుఖ్య, దుఃఖ్య అని ధాతువులగును. దాని అందలి 'సుఖ' అను దానికి 'లఙ్' లో 'అసుఖ్యత్' అని ప్రథమపురుషైక వచనమునఁ గలిగిన రూపము.

మఱియు నామధాతువులపై విశేషార్థములను దెలుపు సన్, క్యచ్, యఙ్, యఙ్లుక్, క్విప్, మున్నగు ప్రత్యయములు వచ్చి, ఎట్టి పరిణామ మొందునో, అందును కర్మార్థభావార్థములం దెట్టిపరిణామ మొందునోయట్టి విశిష్టరూపము లీ కావ్యమున నించుమించుగా ప్రతిశ్లోకమునఁ గనఁబడును. మచ్చునకై నాచేత నైనంతలో ప్రక్రియ చేసినరీతిని బ్రహ్మశ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారు వ్యాఖ్యయందు చేసి చూపిన యెడ- ఆవ్యాఖ్యకు వ్యాఖ్య చేయవలసివచ్చును, కావుననే శ్రీశాస్త్రి గారు రేఖామాత్రముగా నన్నితిజంతరూప విశేషములను చూపుచునే వచ్చినారు.

1-వ స. 45- 'అను' 'పూర్వక' భూధాతువుపై యఙ్ -లో (భృశార్థమున) చేసి- కర్మార్థమున- "లుఙ్" లోని రూపమగును 'అన్వబోభూయి' అను రూపము కూర్పఁబడెను. మఱియు- 'అబోబుధతాం' 'బుధ అవగమనే' అను ధాతువుపై ప్రేరణార్థమున ణిచ్ వచ్చిన పిదప లుఙ్లో ప్రథమపురుష ద్వివచనాంతమైన రూపము, మఱియు అను బోభూయాం బభూవే, పీప్రాంచక్రాతే, మాక్తికంది, మహీనంది వజ్రంది, మున్నగు అపూర్వములగు క్రియాపదములు విమర్శించి తెలిసికోఁ దగినవి. యిందు కోకొల్లలు. సంధివిషయమున - నొకచిత్రము చూపబడినది.

4-వ సర్గము 54-వ శ్లోకము :- (వైశ్యదేవీ వృత్తము) అష్టావింశత్యక్షౌహిణీం ద్వేషిసేనాం హత్వా౽స్మద్రాజ్యం సోదరం రక్షతః స్మ. ఆభ్యాం కః కార్యో౽స్యాభిరద్యోపచారః కిం "కిముక్తం" తత్త్వార్షదాః ధర్మశాస్త్రైః "అనఁగా ఇరువది యెనిమిది యక్షౌహి

ములశత్రుసేనను వధించి, నా రాజ్యమును, నా సోదరుని వీరిద్దఱు రక్షించిరి. కాన వీరిని మేము ప్రత్యుపకార మేమి చేయవలెనో, సభ్యులారా! ఇట్టియెడ ధర్మశాస్త్రము లేమేమి చెప్పుచున్నవో. తెలుపుడు అని భావము.

ఇందలి అ, జ్ఝ ల్విసర్గ, పూర్వరూపాదిసంధులు సామాన్యము లైనవే, కాని 'కిం. కిమ్వ్ క్తం' అనెడి సంధి కార్యమునఁ గల చమత్కారము సత్యము. కిమ్+కిమ్+ ఉ + ఉ క్తమ్ ! అను వీనిలో రెండవ 'కిమ్' శబ్దములోని మకారమునకు పరమైన 'ఉకారము' వితర్కార్థము గలది. ఏకాచ్కము, కాన 'నిపాత ఏకాజనాఙ్' అను సూత్రముచే నిపాతమై 'ప్రగృహ్య' సంజ్ఞ నొందినది. కావున 'ప్లుత ప్రగృహ్యా అచి నిత్యం' అను సూత్రముచే ప్రకృతిభావము అనఁగా సంధి లేకుండ (కిమ్ + ఉ = కిము) కిము + ఉ క్తమ్ = 'కిముఉ క్తమ్'అని యొక్క రూపము నసే ఉండవలసియున్నది. దానికి వికల్పముగా బాధకమై 'మఞ ఉఞో వా' అను సూత్రముచే కిమ్ శబ్ద మకారమునకు పరముగా నున్న 'ఉఞ్' లోని ఉవకారమునకు ఉ క్తమ్' అను దానిలోని ఉకారము పరమయి నందున ఆఉకారమునకు వకారము వికల్పముగా నాదేశమై కిమ్+వ్+ఉ క్తం = 'కిమ్వ్ క్తమ్' అనియు - వెనుకటి ప్రకృతిభావము (సంధిలేమి) చే 'కిముఉ క్తమ్' అనియుఁగూడ నుండును.

దానుగా రీరహస్యము తెలుపవలె ననియే పాణినీయమునఁ జానుఁబడిన యీవిశిష్ట సంధిలోని పదబంధమును ప్రకరణోచితముగా నడుకకొనినట్లు కూర్చినారు.

"సర్గము 1 శ్లోకమున:- వేదద్రష్ట్రాపి వా..." అని వయుక్తమైనది. వేదద్రష్టృ+ఋషిసేవ్యా = వేదద్రష్ట్రృషిసేవ్యా అం సవర్ణదీర్ఘ సంధియే కాని 'పితౄణాము" అనునట్టి వొకట రెంటం దక్క, అ, ఇ, ఉ, ల సవర్ణదీర్ఘ సంధివలె ఈ ఋకార సవర్ణదీర్ఘసంధి

అంత వరిచురపు కాకపోవుటచే చూడఁగనే ఏదియో యొక చింత స్ఫురించును.

4. 47 శ్లోకము-"పాణౌకృత్వ జయార్ధం రక్షస్తాం వృతనాం మాం భూభర్తార ముపేతాం మత్సోదర్య మహేంద్రం" అని కలదు. దీని వ్యాఖ్యానమున "జయార్ధం = జయలక్ష్మిం అనునది వరిమాణ పతితము అనుకొందును. అచట "జయర్ధిం" అని కవిపాఠమై యుండును. "జయ + ఋద్ధిః" సూర్యరాయాంధ్ర నిఘంటువున "ఋద్ధి" శబ్దమునకు 1 సమృద్ధి 2 పార్వతి 3 లక్ష్మి అనియు మేదినీ నిఘంటువున "ఋద్ధిః స్యాద్ దౌషధీభేదే సమృద్ధా వపి యోషితి" అనియు నుండుటచే జయర్ధిం = జయసమృద్ధిని, లేక జయలక్ష్మిని" అనుకోవచ్చును. "పాణౌకృత్వ = పరిణీయ" అనెడి వ్యాఖ్యయు సుసంగతమగుచున్నది. ఇఁక "పాణౌకృత్వ అనునది నిత్యం హస్తే పాణావుపయమనే" అను పాణినీయముచే జయలక్ష్మిని పెండ్లాడి అనఁగా సంపూర్ణ విజయము పొంది అను అర్థము స్పష్టమగుచున్నది. ఈ 'పాణౌకృత్వ" అను సమాసమునందలి చమత్కారము చూపకించియే దాసుగారు చక్కఁగ కూర్చినారు. హస్తేకృత్వ, పాణౌకృత్వ, అని చూపఁబడిన సమాసములందలి హస్తే, పాణౌ అనునవి సప్తమ్యంతములైన అవ్యయములు. వానికి హస్త మనియే అర్థము అని వ్యాఖ్యానింపఁబడెను. "పాణౌ+కృత్వా" అనువానికి సమాసము చేయఁబోవ-సమాసేఽ నఞ్ పూర్వే క్త్వో ల్యప్ అను సూత్రముచే కృత్వా అనుదానిలోని 'క్త్వా' ప్రత్యయమునకు ల్యప్ప్రత్యయ మాదేశమై పాణౌకృత్య "అనురూపము నొందినది ఇది యొక చిత్రమైన మార్పు కాదా?

1 సర్గము 16 శ్లోకమున సకల మగు స్వర్గమున అనుసర్ధమున సర్వం దివం అని దాసుగారు ప్రయోగించిరి. దివ్ శబ్దమునకు స్వర్గము 1 ఆకాశము. అని అర్థములుఁగలవు. ఆరెండర్థములందును ఆ శబ్దము

స్త్రీలింగము. "సురలోకోద్యౌ దివౌ ద్వే స్త్రియామ్" అనియు, 'ద్యౌ దివౌ ద్వేస్త్రియా మభ్రమ్' అనియు అమరకోశమున స్పష్టముగా నున్నది- దాసుగారు నపుంసక లింగముగా నెట్లు ప్రయోగించిరి? అది చూడఁగా అమరవ్యాఖ్య యగు సుధయందు - "ద్యౌః స్త్రీ స్వర్గేచ గగనే దివం క్లీబం తయోః స్మృతం" అని యేనిఘంటువులోనిదో కాని చూపఁబడెను - ఆరూప ప్రకటనమునకే దాసుగారు సర్వం, దివం అని నపుంసకలింగముగా ప్రయోగించినారు-

5-వ స, 18 శ్లోకమున - తిష్ఠమానా అని ప్రయుక్తము 'స్థా' ధాతువు పరస్మైపదము దానికి లిడర్థమున శతృప్రత్యయము వచ్చి పుంలిగమున తిష్ఠన్ అనియు స్త్రీలింగమున తిష్ఠంతీ అనియు రూపము లొందును. అట్టియెడ తిష్ఠమానా యని ఆత్మనేపదమునకు రాఁదగిన శానచ్ ప్రత్యయ మెట్లువచ్చెను? అనినచో 'ప్రకాశన స్థేయాఖ్యయోః' అను సూత్రముచే ప్రకాశనార్థమునను, స్థేయార్థమునను ఆ స్థా, ధాతు వే ఆత్మనేపదమగును, శాన, శాన జంతమైనది. ఈశ్లోకమున సార్వభౌమునిపుత్రిక రాజపుత్రుని కొఱకై అనురాగ ప్రకాశనము చేయుచున్నది. అనునర్థమున ప్రకృతమునకు చక్కఁగా కుదిరినది. దీని కుపష్టంభకముగ భట్టికావ్యమున - శూర్పణఖ భార్యార్థము కుఁడగు రాముని విడిచిపెట్టి. "తస్థే సౌమిత్రయే సకా"అని ఆత్మనేపదమున తస్థే అని ప్రయుక్తమైనది, 'రామం భార్యార్థం అవజ్ఞాయ, సౌమిత్రయే శ్లాఘ హ్నుఙ్ ఇత్యాదినా సంప్రదాన సంజ్ఞా, తస్థే స్వాభిప్రాయం మైధునాయ ఆవిష్కృతవతీ ప్రకాశన స్థేయాఖ్యయోశ్చ ఇతి ప్రకాశనే తఙ్' అని వ్యాఖ్యానింపఁబడెను. లక్ష్మణునికొఱకై తెలియునట్లు తన భోగేచ్ఛ ప్రకటించినది అను నర్థమున తస్థే అని ఆత్మనేపదరూపము ప్రయుక్తమైనట్లే యుచటను తిష్ఠమానా అనః ఆత్మనేపదమున వచ్చు శానజంత రూపము దాసుగారు ప్రయోగించుట యెంతయు శ్లాఘ్యము

5-48 శ్లోకమున తిష్ఠద్గు పదప్రయోగము గలదు. అది అవ్యయీభావ సమాసముగా పాణినీ మును 'తిష్ఠద్గు ప్రభృతీని చ' అని విన

రింపఁ బడినది "తిష్ఠద్గు" అనగా ! దోహనకాలము. ఆవులను పాలు పితుకు వేళ. దీనిని బట్టి మహాకవి 'ఆతిష్ఠద్గు జపన్ సంధ్యాం ప్రక్రాంతా మాయతీగవం ప్రాత స్తరాం 'పతిత్రిభ్యః ప్రబుద్ధః ప్రణమన్ రవిం' అను శ్లోకమున భట్టికావ్యము, 4-18 లో ప్రయోగించెను. సంధ్యాం సంధ్యాకాలం అధికరణం, దేవ "అత్యంత సంయోగే ద్వితీయా ! ప్రక్రాంతాం. ఆయతీగవం, ఆయత్యః ఆయాంత్యో భవంతి యస్మిన్ కాలే గావః, అస్మిన్ ఆయతీగవం, అరబ్ధాం. ఆఙ్పూర్వా దిణః శతరి, "ఇణో యణి" ఇతి యణి, జీపి చ రూపం, ఆయతీతి, గావోపి గోచ రాత్ గోష్ఠ మాయాంతి దివస స్యార్ధనాడికావశేషే. సంధ్యాపి తదైవ వర్తతే.

"కియంత మేవం జపన్" ఇత్యాదౌ- 'ఆతిష్ఠద్గు' ఇతి తిష్ఠంతి గావోయస్మిన్ కాలే దోహాయ-, గావో హి రాత్రిప్రథమ యామస్య నాడికాయా మతీతాయాం విక్రాంతాః సత్యః, ఉద్ధావ్య దుహ్యంతే ఇత్యాదిగా వ్యాఖ్యానింపఁబడెను. "గోవులు పశ్చికబయళ్ళనుండి పగలంతయు కడుపునిండ మేసి అరగడియ పొద్దుండఁగా తమ గోష్ఠమునను (గోవులుండు చోటు) వచ్చును" రాత్రి ప్రథమయామము మొదటి గడియ దాఁటుదాఁక, అనఁగా రాత్రిఒకగడియకాలము విశ్రమించిన తరువాత - లేవఁబడి- నిలిచిన యప్పుడు పాలు పిదుకఁబడును-' అని అదియే తిష్ఠద్గు "కాలము దాసుగా రీరహస్యము నెఱిఁగినవారు గావుననే - దానిని ప్రకరణోచితముగా ప్రయోగింపఁగలిగినారు- ఆయన యేశబ్దమును ప్రయోగించినను ఎందెంత విచారణ మొనర్చి యుండిరో తెలియుటకే నాయీ చాదస్తము గాని యన్యము కాదని ప్రాజ్ఞులకు నా విన్నపము.

4-వ స. 29 శ్లోకము:- "దోషాభూతం" అని కలదు. 'అస్వచ్వౌ" అను సూత్రముచే బ్రహ్మీభూతం' మున్నగువానివలె "దోషీభూతం" కావలసి యున్నను - దోషా= రాత్రి యను నర్థమున అవ్య

యము కాన "అవ్యయస్య చ్వ్యాదీత్వం నేతి వాచ్యం" అను వార్తికముచే ఈకారాదేశము కలుగ - "దోషాభూతం" అని యైనది.

4-వ స. 51-వ శ్లోకము:- 'మహాబ్రహ్మాం నత్వా' అనికలదు. బ్రహ్మన్ శబ్దము నకారాంతము పుంలింగము, కాన 'మహాబ్రహ్మాణం' అని కావలసియుండ టచ్ ప్రత్యయము 'కు మహద్భ్యా మన్యతరస్యాం' అను సూత్రముచే వచ్చి బ్రహ్మన్ శబ్దము 'బ్రహ్మః' అని అకారాంతమైనది. పిదప "ఆన్మహతః" ఇత్యాది సూత్రముచే "మహత్" 'మహా' యై - మహాబ్రహ్మః- అని యైనది. దాని ద్వితీయాంతమే 'మహాబ్రహ్మాం' అను విశిష్టరూపము. 3-వ స. 6 వ శ్లోకములో - భేదం భేదం - ఖానం ఖానం - దారం దారం- అని కలదు.

ఇవి భిద్, ఖన, దృ- ధాతువులపై 'భిత్వా ఖనిత్వా, దరిత్వా' అను క్త్వార్థకరూపములకు "అత్యంతము" అనునర్థమున (అభీక్ష్ణ మసకృత్సమాః అని అమరము) 'ఇమున్' ప్రత్యయము రాఁగా భేదం భేదం ఇత్యాది రూపములు సిద్ధించినవి. ఆభీక్ష్ణ్యే ణాము ల్చ" అను సూత్రమునఁగల చకారముచే క్త్వాంతరూపములుగూడ నుండును. భిత్వా భిత్వా అని కాని భేదం భేదం అని కాని రెండు విధముల నుండు నన్నమాట.

ఇంకను వ్యాకరణముచే సిద్ధించు చిత్ర విచిత్రము లగు శబ్దములు ఈకావ్యమున బహుళముగా కనఁబడును.

ఉదమనాయంత "అగురూయంతే, ఉపశ్లోకయంత" అను ణిజంతములు వ్యాఖ్యలో (శ్రీ) శాస్త్రిగారు చక్కగా వివరించి యున్నారు. ఇట్టివి యెన్ని యని యెత్తి చూపఁగలను? ప్రాజ్ఞులదృష్టిలోనికి దెచ్చుటకు దాసుగారి అపురూపపు ప్రయోగములు కొన్నిమాత్రము చూపెదను. న్యపీవృతత్, అన్వసార్ధీత్, అనాయి, (చిణ్ణంతము). అభ్రాజి, అపతరత్, అనూనకమ్, (ఊనయది- ఊనపరిహాణే చురాది) అచ్, న+ ఊరేనమ్, స్వార్థే కన్- అని అమరసుధ)- అబోబుధతాం (బుధధాతో ర్ణ్యంతా లుజి ద్వివచనమ్) అభ్యలషత, దేవత్రామూ, దేవసథం, అవ్వబోభూయి, అపీవతత్-అపోవుపిష్ట, ఆశిశత్, అతితిరాయ

సమ్యాచిచత్, అపూర్ణచంద్రాత్, అన్యాబోభూయాం బభూవ సంగాయ సమ్ పూర్వకగా ధాతు ల్యబంతము) సంతీర్య (సం+తీర్త్వా) అభాక్షీత్; మున్నగు విచిత్ర ప్రక్రియగలవి కల్పించిన నెమిలిఫించమువలె సమితముగా నిందు కనబడునని చూపితిని.

కావ్యమీమాంసయందు రాజశేఖరపండితుడు శాస్త్రకవి కావ్యకవి ఉభయకవి అనికవులు మూడువిధములనెను. శ్యామదేవుడను శాస్త్రవేత్త ఆముగ్గురలో ఉత్తరోత్తరులు శ్రేష్ఠులని నటి' రాజశేఖరుడు స్వవిషయమున ముగ్గురును గొప్పవారే అగుదురని - రాజహంస వెన్నెలను త్రాగలేదు, వెన్నెలను త్రాగు చకోరము నీళ్ళనుండి పాలను వేఱుచేయజాలదు! అట్లే శాస్త్రకవి శాస్త్రవిషయములను చక్కగా నిరూపించును. కాని రససంపదను విచ్ఛిన్న మొనర్చును. కావ్యకవి తర్కకర్కశమైన శాస్త్రవిషయమునైనను ఉక్తివైచిత్రిచే సరళము (సరసము) నొనర్చును. ఉభయకవి యారెండింటను ప్రవీణుడైనచో ఆయిరువురకంటెను గొప్పవాడు అనవచ్చును అని పరిష్కృతమున దాసుగారు తారకకావ్యమునుబట్టి శాస్త్రకవి, హరికథామృతమునుబట్టి కావ్యకవి, ఇతరములగు సకలవిధములైనవి, వివిధభాషామయములైనవియునగు రచనలనుబట్టి ఉభయకవి అని విభజించి చెప్పవచ్చును. కాని - 'సర్వయోగే మహాకవిః' అనిన యీ రాజశేఖరుని తుదితీర్పు ప్రకారము, మహాకవి అని ఘంటాఘోషముగా చెప్పవచ్చును.

సర్వగుణములనగా, చమత్కార జీవకములగు శబ్దార్థములు లోకన్యాయములు, పదునాలుగువిద్యలు, చతుష్షష్టికళలను కవిత్వమున కంగములుగా కూర్పు గలిగిన [illegible] ఆదికావ్యము, ఆ గుణ... కవిమీద నెంతభారమున్నదో తెలిపెడి భావముగల "న స, శబ్దో న సన్యాయో న, సా విద్యా న సా కళా, జాయతే యన్న కావ్యాంగ మహో భారో మహాన్ కవేః" అనుసూక్తికి లక్షణమైన దాసుగారే

రాజశేఖరుఁ డనినట్టి సర్వగుణయోగి యాటచే మహాకవి యనుటకు సంశయమేల?

'ప్రతిభావ్యుత్పత్తిమాంశ్చ కవిః' అని రాజశేఖరుఁ డనిన ప్రతిభకును వ్యుత్పత్తికిని - రెండుదాహరణము లాయన యితర రచనల నుండి చూపెదను:-

ప్రతిభ "యనిన నవనవోన్మేషము గల బుద్ధికదా :-

కవిర్మనీషీ పరిభూః స్వయంభూః। అని యీశావాస్యోపనిష త్తున పరబ్రహ్మపక్షముగాఁ జేర్చిన యర్థమే కవికిని సరిపోవునని వ్యాఖ్యానింపఁబడెను - అందలి పరిభూః। అనెడిపదములకు 'యశోఽపరిభవతి' అని భాష్యము. పరి అనగా ఉన్నది యని (ఛాందసము) యు-సర్వమునకు ఊపిరి. పాండిత్యము. సర్వతంత్ర స్వతంత్రుఁడు, ధీరుఁడు, వీరుఁడు స్వచ్ఛందుఁడు సత్యసంధుఁడు, హరికథా పితామహుఁడు శిష్య కోటికి సంగీత సాహిత్య విద్యాప్రదానమున కులపతి-అట్టివాఁడు అంత వాఁడు ఆదిభట్ల నారాయణదాసుఁడు.

అట్టి మహాపురుషుఁ డున్నకాలమునఁబుట్టి ఆయన భాగవతము నొకటి రెండు మాఱులు గ్రోలుభాగ్యము నొందుటే కాదు, రవంత పరిచయభాగ్యము కూడ గలవాడ నగుటచే-ఆయనయందు నాకుఁ గల వ్యక్తిక గౌరవభావమున-నాయన రచనయగు సీతారకకావ్యమునకు ఉపోద్ఘాతమని నేను వ్రాయసిద్ధమైతిని. అనన్యసాధ్య మగు నీకావ్య మునఁగల విశేషములన్నియు వెల్లడింప నాకుఁ గాదుగదా! సాక్షాత్తు సరస్వతికి కూడ నసాధ్యమే హా యని యంకుచునే బ్రాహ్మీభూషణ కాంభట్ల లక్ష్మీనారాయణ శాస్త్రులవారి సంస్కృతాంధ్ర వివరణముల సాహాయ్యముచేతను, విజ్ఞాననిధులగు శ్రీకరా ఈశ్వరరావుగారి ప్రేరణముచేతను - దాసభారతీపూజ కొక పువ్వుముగా నర్పించుకొంద మని యీ పీఠిక వ్రాయఁదలంచితిని - నాసాహసమును పండితులు మన్నింతురుగాక యని వేడుచు సెలవుగైకొనుచున్నాను.

ఇట్లు

వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

# హృదయోల్లాసము

"వ్యాఖ్యానే కావ్యనిర్మాణే సమీక్షాయాం నివేదనే
యత్రస్మభాతి వందేఽహం నారాయణ చతుష్టయమ్"

ఈ లోకముయొక్క స్వభావమును అర్థము చేసుకొనుట యనగా సం పూర్ణముగా భగవంతుని అర్థము చేసికొనుట. కాలము ఎన్నెన్ని చిత్ర విచిత్ర సన్నివేశములను కల్పించునో!

"ఏతి జీవ న్తమానందో నరం వర్ష శతాదపి"

వాల్మీకి (శ్రీ) సూక్తి నాకు ఈశ్వరానుగ్రహమువల్ల తారక మహాకావ్యమును చదివి హృదయోల్లాస మావిష్కరించుకొను నవకా శము లభించినది. ఇది గొప్ప అదృష్టమే! ఇది వాల్మీకి వచనమునకు అర్థమేమో!

వ్రాయవలెనన్న ఉబలాటము ఉండవచ్చునుగాని వ్రాయు టెట్లు? వ్రాయుటకు సామర్థ్యము కావలయునుగదా! దానికై వెదకుచున్నాను. చీకటిలో వెదకినట్లేయున్నది. "అట మిన్నందిన యట్టివాని పొడవెం తన్నట్లు"గా నారాయణదాస వాఙ్మయముతో పాటుగా నేనును పెరగ వలసి వచ్చుచున్నది. నాకంతశక్తియేదీ?

కాని నా హృదయోల్లాసమును నివేదింపక తప్పదు. ఇది కర్త్ర ఈశ్వరరాయ హృదయము. నిర్వ్యాజమైత్రి, నన్నీ యిరుకున పెట్ట నవి. గురువుల అనుగ్రహము వ్రాయింప వలయును.

నారాయణదాస వాఙ్మయమును మొత్తమును మధించి, శోధించి? బహుశ్రమలకోర్చి, బహువ్యయమునకోర్చి (శ్రీ) ఈశ్వరరావుగారు బహు విధ వ్యాసరచనా విశారదులైన వారిచే నవనీత కల్పముగా నారాయణ దాస సారస్వత సిరాజనమును వ్రాయించి ప్రకటించినారు. ఆ ప్రకటన విజయసారథి (శ్రీ) జోగారావుగారు.

మానవులు కొన్ని కొన్ని దశలలో కొన్ని కొన్ని అనుభవములు స్వాభీష్ట సిద్ధిగాను యాదృచ్ఛికముగాను అనుభవించుచుందురు. వంద మంది వ్యక్తులు ఒకే అనుభవమును అనుభవించినపుడు ఆ అనుభవ స్వరూపమును ఏ ఒక్కడో చెప్పగలిగిన చెప్పగలుగును. అట్లే వేయి మందిలో ఒకడు తన అనుభవమును వినువారికి తెలియునట్లు చెప్పగలిగిన చెప్పగలుగును. కోటిమందిలో ఒకడు తన అనుభవమును అందరి హృదయమున కెక్కునట్లు చెప్పగలుగును. ఇట్లు చెప్పగలిగిన వానిని సామాన్యముగా కవి అన్న పేరుతో లోకము వ్యవహరించుచున్నది. ఈ కవులలో తాననుభవించిన అనుభవముకంటె తన కావ్యమును చదివిన వాడు అధికమైన ఆనందమును పొందునట్లు నిర్మాణము చేయుట రస జగన్నిర్మాణము చేయుట అన్నమాట. ఈరస జగన్నిర్మితిలో కవి ఈ లోకమునకు సంబంధించిన పాంచభౌతిక సర్వ వాసనాదూరుడై రస ప్రవణ బుద్ధియై అర్థధర్మమునంది సుకుమార మార్గమువలన బ్రహ్మానంద సబ్రహ్మచారియగు రసానందమును లోకమునకు పంచిపెట్టును. వీడు అచ్చమైన కవి,

కావ్య పఠనముచే తత్తుల్యమైన ఆనందమును అనుభవించువాడు సహృదయుడు.

"సరస్వత్యా స్తత్వం కవి సహృదయాఖ్యం విజయతే."

అని కదా అభినవగుప్త పాదాచార్య సిద్ధాంతము. ఈ పద్ధతికి సర్వాత్మనా సరిపడునది ఈ తారకము. కవిత్వము సహృదయత్వము మాత్రమే కాక దివ్యములైన నానావిధ కళా సమాహారము, శ్రీ నారాయణ దాసుగారు. కావున తత్కృతమైన దేనిని గాని సంపూర్ణముగా గ్రహించుట అసంభవమనియే చెప్పవచ్చును. లోకములో దాస పదమునకు ఎక్కడలేని గౌరవమును సంపాదించి పెట్టిన మహానుభావుడు దాసుగారేగదా! రావణుని సభలో ఆంజనేయుడు చెప్పిన సమాధానము తొలిగా దాసపదముతో నారంభమగుట.

"దాసోఽహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్టకర్మణః"

ఈసూక్తి (శ్రీ) దాసహృదయమునకు, దాసత్వ సంఘటనకు ప్రేరకము కావచ్చును, ఆ ప్రేరణ ఎందరెందఱినో దాసులనుజేసి దాసదాసులను జేసి సుఖజీవన హేతువగుట నేటి లోకము చక్కగా నెరుగును. ఎదుటి వారి యందు ఏమాత్రము వైశిష్ట్యమున్నను పరవశించి పారితోషికము లిచ్చి పంపునట్టి ఔదార్యముకూడ దాసుగారి అసాధారణ సహృదయతకు తార్కాణమే. ఒక విధముగా దండకాషాయములు లేని నిజమైన సన్న్యాసి దాసుగారు.

"స్వస్థాన వేషభాషాభిమతా స్సంతః కస ప్రలబ్ధ ధియః" అన్న యభట్టు వచనమునకు పరమోదాహరణము దాసుగారు. కా(వు) ననే దాస హృదయ మహా సముద్రమునుండి ఈ తారక కౌస్తుభము పుట్టినది. ఎంత మథనము జరిగినదో!

ఈ తారకము దేశభక్తి ప్రధానమైనది. స్వస్థానమును స్వవేష మును స్వభాషను వారే సంరక్షించుకొనక పోయినచో నంతకంటె అపరాధమేమున్నది? సమకాలికులైన వారు చాలమంది మనమే తెలి సిన వారము అనుకొను వారందరు పై యపరాధమునకు స్థానమైన వారే! ఆవారి నుద్ధరించెడి తాత్పర్యమే ఈ తారక నిర్మాణహేతువు.

కాళిదాసు కుమార సంభవమునందు పార్వతీవర్ణనమున "ప్రపే దిరే ప్రాక్తనజన్మ విద్యాః" అన్నాడు కదా! ఆ వచనము అప్పటి నుండి ఇప్పటివరకు ఎక్కడో ఒకచోట ఏదో రూపముగా విద్యావిష యమున సార్థకతను పొందుచునే ఉన్నది. ఇప్పుడు ఈ సూక్తికి (ప్రత్యక్ష) ముగా సార్థకత్వము కలిగించినవారు దాసుగారు. ఆ విషయమున మనము పొరబడుదుమేమో అని పాపము! ఆయనయే స్వభావసిద్ధమైన నా పాండిత్యబలముతో నేను ఈ తారకమును వ్రాయుచున్నానన్నారు.

అద్భుతమైన ప్రతిభాలక్షణము మొదటి శ్లోకమున నిర్వహించిన అలంకారముచేతనే తెలియుచున్నది. ప్రథమ శ్లోకమున నిరూపితమైన దృష్టాంతముచే బింబ ప్రతిబింబ లక్షణము సుస్పష్టమగుచున్నది. అనగా కవి యొక్క హృదయమునకు ఈ కావ్యము ప్రతిబింబము. ప్రథమము కవి యొక్క యూహా, దానిచేత సంభావింపబడిన సంభావన. అది లోకము నందు ప్రతిబింబితమై దృష్టాంతమగుచున్నది. ఒక అలంకారము స్వరూపము నందుటకు పూర్వము పొందెడి దశాభేదములు నానావిధములైన సంస్కారములతో భాసించినట్లే దేశగతమైన హృదయ పరివర్తనాదులను లౌకికములైన అలౌకికములైన హృదయ సంస్కారములను ఈ కావ్యము స్పష్ట రేఖముగా చెప్పుచున్నది.

ఆత్మ బింబము కాగా తదధివాసమైన హృదయము ప్రతిబింబమగుచున్నది. సంస్కృతమైన హృదయముయొక్క సంస్కారములన్నియు బింబములు కాగా దేశీయములైన ఆచారాదులు ప్రతిబింబములగుచున్నవి, ఈవిధముగా బింబ ప్రతిబింబ భావాపత్తి దృష్టాంతమునకు బీజము కావున ఈ కావ్యము బింబమై యావద్భారతమును ప్రతిబింబింప చేయుచున్నది- అంతేకాదు కావ్యమునందు నిబద్ధమైన తారక రాజపుత్రులలో నాయకుడైన తారకుడు నారాయణదార ప్రతిబింబము, ఈ ప్రతిబింబత కావ్యమునందలి సర్గలయందును అన్ని ఘట్టముల యందును నిసర్గ మధురముగా అదికియున్నది.

ప్రథమ శ్లోక నిబద్ధమైన దృష్టాంతము ఇంక విశేషము నిచ్చుచున్నది. ఈ అంశములన్నియు సహృదయుని సంస్కారమునుబట్టి సముల్లసితములగును. చిన్ని అద్దమున కొండలు ప్రతిఫలించినట్లే, చిన్న మంత్రమున దైవము ప్రతిఫలించినట్లే, ఈ కావ్యమున ఈ ద్వీపమే కాక ద్వీపాంతరములు కూడ ప్రతిఫలించుట విశేషము.

నిజముగా కవి శబ్దమునకు నారాయణదాసుగారు అర్థమని నా తాత్పర్యము. ఇతరులు కారని నేను వివాదమునకు పోను. దాస సాహితియందు సమస్త కలాసమాహారము నారుపోసినట్లుగా ఉబికి వచ్చుట సహృదయులకు అగోచరము కాదు. ఈ కావ్య కన్య ఒక విధముగా భట్టి కావ్యమునకు సహోదరి.

మూడవసర్గ లిడధికారమునందు

"తత్సౌందర్యం తదౌన్నత్యం తత్తేజ స్తత్పరాక్రమః
తత్తారుణ్యం తత్ప్రతిభా ముమోష జన మానసమ్"

ఇందలి తచ్ఛబ్దముతో సమసించిన సౌందర్య ఔన్నత్య తేజః పరాక్రమ తారుణ్య ప్రతిభలు ద్రిష్టృజన మానసమును. అపహరించినవి. కాదు, దొంగిలించినవి. అపహరణమనగా బలత్కారముగా తన ముందున్న వస్తువును లాగికొనిపోవుట. దొంగిలించుటయనగా తనకు తెలియకుండ గైకొనుట. ఈ విషయమును దాస భారతి మనోహరముగా వర్ణించుట మాత్రమే కాదు వ్యస్తమైన రచనచేత ఆవారియందలి గుణవైవిధ్యము ఆ గుణములయొక్క సర్వోత్కృష్టత సారాలంకారమును ధ్వనింపజేయుచున్నది.

వీరిట్లు సర్వజన మానస హరణమునందు ఇంత కృతహస్తులగుటకు కారణము పైనచెప్పినవారి గుణములు. ఆ గుణములింత తేలికగా దొంగిలింపగలవా? అన్నచో పై శ్లోకము

"సమున్నతో తావాజాను
బాహూ సర్వాంగ సుందరౌ
బహు తేజస్వినౌ దృష్ట్వా
ముమోహ నగరీ జనః''

ఈ శ్లోకమునందలి చమత్కారమేమనగా ఒకపర్యాయము "నగరీజనః" అని సమస్తముగాను, మఱొక పర్యాయమున నగరీ జనః

అని వ్యస్తముగాను సమన్వయించినచో వారి ఆ సర్వాంగ సౌంద ర్యాది గుణ విశేషములు చైతన్యవంతమైన జనమునేగాక అచేతనమైన నగరిని కూడ మోహపెట్టినవి. మోహ మనగా సర్వేంద్రియ జ్ఞాన విమూఢత. అట్టి సమయమున మనస్సులను దొంగిలించుట సులభము. వీరు కేవల రూపమాత్రమైన వైభవము కలవారు మాత్రమే కాదు, అందలి శాస్త్రపండితులను, మీమాంసా పండితులను, వైయాకరణులను తార్కికులను పశు - మనుష్య వైద్య శాస్త్రజ్ఞులను అవలీలగా గెల్చి నారు. ఆవారిని చూచుటయందు నగరీజనము, నగరముజనమునుఎంతయో కోరుకొన్నది. ఈలిట్టు ఇచ్ఛా విశేషబోధకమగుటచే క్రియాప్రయో గమునందు కవియొక్క కృతహస్తత ఎంతగానో స్పష్టమగుచున్నది.

సాధారణముగా సామాన్యకవులు అలంకారములను ప్రధాన ముగా భావింతురు. ప్రసిద్ధాలంకారములలోని ఉపమ, రూపక, ఉత్ప్రేక్ష సమాసోక్తులలో ఏ ఒకటి రెండు అలంకారములనో చక్కగా నిర్వ హించుటచేత కృతార్థులమైతి మనుకొందురు. కాని అవి శరీరాలంకా రము వంటివి, సహజసిద్ధమైన ప్రాణశక్తి, సహజసుందరమైన అవయవ సన్నివేశము లేనిచో ఈ అలంకారాదులు ఎంతవరకు ప్రయోజకములు కాగలవు? వాల్మీకి రామాయణమునందు వెదకిన ఎన్ని అలంకారములు మనకు గోచరించును? కవి కుల గురువులైన కాళిదాసు తన కావ్యము లలో ఎన్ని అలంకారములను తీర్చినాడు? ఈ విశేషములు రససిద్ధులైన కవులకు పాటికిరావు. యాదృచ్ఛికముగా ఏదేని ఒక అలంకారచ్ఛాయ తోచును. "ఉపమా కాళిదాసస్య" అన్నమాట కర్థము 'ఉపమైక శరణాః కవయః' అను దానికి అపవాదమువంటిది అగును. ఈఉపమా లంకార ప్రపంచము ఎంత విస్తృతమో తదాశ్రియణముచే కవిప్రతిభ ఏవిధముగా తళత్తళలీనునో కాళిదాసు దిఙ్మాత్రముగా సూచించినాడు కాని దానినే ఆశ్రయించినాడనుట తగవుకాదు.

మరొక విశేషము. ఎప్పుడేని ఎక్కడనేని కాళిదాసు ఉపమను నిర్వహించినచో ఆ ఉపమయందు లాక్షణికుల తాత్పర్య విషయీభూతమైన అతిలోక చమత్కార మేదియో గోచరించి తీరును. ఇంకొక విశేషము. అప్రత్యక్ష విషయములతో ప్రత్యక్ష విషయములను, ప్రత్యక్ష విషయములతో అప్రత్యక్ష విషయములను పోల్చుట అతని ప్రత్యేకత, ఆవిద్యను కాళిదాసునకు వాల్మీకి చక్కగా నేర్పినాడు- "శ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్" ఈ విధముగా అలంకారమును నిర్వహించు నేర్పు నారాయణదాసుగారి కంతగా కలదు. ఇదిగో ఈ ఉపమాలంకారమును పరికింపుడు.

"క్వచిత్కేశాకేశి వ్యథిత చికురో భిక్షుక ఇవ
క్వచిన్ముష్టీ ముష్టీవ హత దశనోఽ విత్తదశమీ।
క్వచిద్బాహా బాహి ప్రశమిత బలో వాతకి సమః
క్వచిద్దండాదండి ద్విడ సృగమితో రోచన ఇవ"

ఇందలి నాలుగు పాదములందును నాలుగు విధములైన యుద్ధములను వర్ణించినాడు- ఆ వర్ణనములోని వైచిత్రి యేమనగా కొందరు భిక్షువులవలెయుద్ధమును చేసినారు- ఈ ఉపమయందు కార్య కారణభావము వివక్షితమైనది- బలహీనులైనవారు వాతరోగులవలె బాహుయుద్ధము చేసినారు దంతహీనులైన కొందరు వృద్ధత కారణముగా ముష్టియుద్ధమునే చేసినారు- కొందరు భిక్షుకులు కేశభార పీడితులు కావున కేశాకేశియుద్ధమును చేసినారు- ఇట్టివి రామాయణ యుద్ధ వర్ణనమునందలి శ్లోకములకు ప్రతికలు- ఇవియును కారణములు కావు- స్వతసిద్ధములే ఇట్టి-

కాంచపద వృత్తము :-

''వ్యాకులయుద్ధే పరస్పరమేవ
శికర రివప ఉపసిముహూర తుదన్

దాఘ్లుత శేషా మహోభయ కంపితా
శ్చరణమయు రధికరణ జయినామ్
బాహుగణాహి వ్రజం చరణోత్కరోరు
కమఠ పరికర మసిత శిరో
రుట్చయ శైవాల సంచయ మద్భుతం
రుధిర జలమభవ దమిత సరః"

ఇందు భుజ భుజంగములకు పాదకచ్ఛపములకు అవిరల కేశ శైవాలములకు శోణిత జలములకు అభేదము వివక్షింపబడినది. కావున ఆ యుద్ధరంగము అమితమై సరోవరము అయినది- యుద్ధరంగ సరోవరముల అభేదము పై అవయవములతో అభేదమును పొందినది కావున సావయవ రూపము-

దాసుగారికి ఈ విధముగా అలంకారములను నిర్వహించుటలో గల నేర్పు ఆశ్చర్యమునే కలిగించుచున్నది- ఇంతే కాక ఈ మహాకవి మరొక విశేషమును కూడ ఈ కావ్యమునందు నిరూపించినాడు- ఏ సమయమున కే వృత్తము రసభావ విలసితమగునో, తదభివ్యంజక మగునో, ఆ విషయము నెరిగి ఆవృత్తమును నిబంధించుట. ఇది వృత్తౌచిత్యము అన్ని విధముల సరిపడియున్నది- ఆద్యంత వృత్తములను పరిపాటి కూర్చుట విలక్షణత- ముక్తపదగ్రస్తమునకు ఒక లక్షణము చెప్పినారు కాని దాసుగారి ఈ కావ్యమును చూచిన పిమ్మట ముక్తవృత్తగ్రస్తము అను లక్షణము నేర్పరచుట సమంజసము.

ఇట్టి కావ్యమునకు వ్యాఖ్యానము రచించు యోగ్యత, అధికారము, అవకాశము, బ్రహ్మశ్రీ కాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి చరణులకు దక్కినది, వీరు బ్రాహ్మీ భూషణులు- ఈ బిరుదమున కర్థము రెండు విధములు బ్రాహ్మికి భూషణమైనవారు బ్రాహ్మియే భూషణముగా కలవారు- ఈ రెండు విధములైన అర్థములును వీరియెడ కుదురు

పడినవి- నాది రెండవపక్షము వీరు అద్వైత వేదాంత విద్యావిశారదులు కావున వాసుదేవ మనన నిష్ణాతులు కావున. వీరు పౌరాణికశిరోమణులు. కావున విశాఖపట్టణమెల్ల వీరిపురాణప్రసంగములతో పులకరించుచున్నది. వీరి ఉపన్యాస ధారాధోరణి సముద్ర తరంగ నిస్వానమును మూదలించుట నేనెరుగుదును. అలంకార శాస్త్రపాథోధి కుంభ సంభవులు. ఈ వీరు వ్యాఖ్యానముచేయుట తెలుగువారికి అదృష్టము పండినట్లే. వ్యాఖ్యానమునకు వ్యాఖ్యాతకు కావలసిన సంపత్తి అంతయు భావార్థ దీపికయందు ప్రదీప్తమగుచున్నది.

"నా మూలం లిఖ్యతే కించిన్నాన పేక్షిత ముచ్యతే"

అని మల్లినాథుని ప్రతిజ్ఞ కదా! ఆ ప్రతిజ్ఞ వీరు చేయకున్నను చేసినట్లే చక్కగా నిర్వహించుట బహుధా ప్రశంసనీయము.

సహృదయ శిరోమణులయిన శ్రీ కన్రా ఈశ్వరరాయ మహోదయులు దాసభారతీ ప్రచురణ కర్తలు. అపూర్వము అపారమునైన శ్రమకోర్చి దాసవాఙ్మయమును ఆంధ్రలోకమున కందించుచున్నారు. ఒక విధముగా ఆంధ్రలోకము శ్రీ ఈశ్వరరావుగారికి ఋణపడుచున్నదనవచ్చును. ఏ విధమైన యోగ్యత లేకున్నను ఈశ్వరరావుగారు నాయందలి అవ్యాజప్రేమతో గ్రంథవ్యాఖ్యాన తాత్పర్యమును చదివెడి అవకాశమును కల్పించినారు. ఇది నా అదృష్టము. నాహృదయమునకు కలిగిన ఉల్లాసమును చేతనైనంతవరకిట్లు ప్రకటించుకొంటిని. వ్యాకరణ సార్వభౌమ బ్రహ్మశ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రిపాదుల కంటెను బ్రహ్మశ్రీ కవితాభూషణ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి చరణుల కంటెను బ్రహ్మశ్రీ అప్పల్ల సోమేశ్వరశర్మ చరణులకంటెను నేను అర్హుడను కాను. ఇది ఈశ్వరానుగ్రహము.

సెలవు

ఇట్లు

కోగంటి సీతారామాచార్యులు

# వ్యాఖ్యాత

(శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రి) గురించి శ్రీ యస్వీ జోగారావుగారి

పద్యము.



అంతర్వాణి వరేణ్యుఁ డార్యజన మర్యాదా మహోదాత్త మా
నాంతస్సారుఁ డనారతా ధ్యయనసాధ్య బ్రహ్మవిద్యా విబు
ద్ధాంతే వాసి జనాంతరంగుఁడు శివైక్యస్నిగ్ధ చిత్తుం డయా
స్వాంత వ్రిక్షుడు రామభట్లగురు పూజార్హుం బ్రశంసించెదన్ -

యస్వీ

# విజ్ఞాపన

కవిత్వముఁ జెప్పుట యొకప్రక్రియ. కథలను వ్రాయుట మఱియొక ప్రక్రియ. అనువదించుట యొకవిధము. వ్యాఖ్యానించుట యింకొక విధము. దేని విశిష్టత దానిదే. దేని క్లేశము దానిదే. అన్నియును ప్రతిభాసాధ్యములే. కాని వీనిలో వ్యాఖ్యానించుట కష్టతరమనిపించును. మూలమును బాగుగా గ్రహించి, యన్వయక్రమమును విడువక, కవియాంతరము నితరులు సులభముగ గ్రహించునట్లు వివరించుట సులభసాధ్యముకాదు. ఆ కీర్తి వ్యాఖ్యాతృమూర్ధన్యుఁడైన మల్లినాథ మనీషికే లభించినది.

నారాయణదాస మహాకవి సహజపాండిత్య ప్రతిభా ప్రాభవములుగల మహామనీషి. సరస్వతి స్వరూపుఁడు. ఆతని సంస్కృత గ్రంథములో, "తారకము - ఉమరఖయామ్" అను రెండు కావ్యములును రెండనర్ఘరత్నములు, భాషాజటిలములు, భావగంభీరములు. అందు మొదటిదీ తారక కావ్యము. దీనిని వ్యాఖ్యానించుటకుఁ బూనుకొనుట సాహసైక కార్యము.

శ్రీ కర్రా ఈశ్వర రావుగారు సహృదయులు, నాకు గురుపుత్రులు. దాససాహితిని బహుముఖములఁ బ్రకటించి లోకులకందించుచున్న సారస్వతప్రియులు. వారి యాదేశమైనది. ఈశ్వరాజ్ఞ. కాదనలేక సిద్ధపడితిని. యథాశక్తి వ్యాఖ్యానించితిని. ఎంతవఱకుఁ గృతకృత్యుఁడనయి

తినో పండితులే ప్రమాణము. "హేమ్నః సం లక్ష్యతేఽగ్నౌ హి విశుద్ధి శ్శ్యామికాపి వా,"

నా వ్యాఖ్యానముపై సమూల్యమైన యభిప్రాయము నొసంగిన "కళాప్రపూర్ణ - విద్వత్కవి శేఖర" శ్రీ వేంపరాల సూర్యనారాయణ శాస్త్రి మహోదయులకు నా హృదయపూర్వక నమోవాకములు. ఈ వ్యాఖ్యను సమగ్రముగఁ బరిశీలించి, నా కన్నివిధములఁ దోడ్పడిన నా మిత్రులు - బంధువులు - సతీర్థ్యులునగు "వ్యాకరణసార్వభౌమ" శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రిగారికి "వ్యాకరణాలంకార చక్రవర్తి" శ్రీ అప్పల్ల సోమేశ్వరశర్మగారికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

ఇట్టి యవకాశమును నాకుఁ గల్పించిన, గురుసమానులు శ్రీ కర్రా ఈశ్వరరావుగారికి మనఃపూర్వకాశీర్వాదములు.

ఇట్లు
వ్యాఖ్యాత.

# తారకే ప్రథమస్సర్గః.

## భూతేఽధికారః

-: ఉపజాతిః :-

1. సా దేవభాషాఽఖిలలోకమాన్యా
ప్రసాధయామ్యత్ర తయా మదూహామ్
హర్షాయ లోకస్య పరిష్కరోతి
తనుం జనోఽనుత్తమ భూషయైవ,

వ్యాఖ్యానమ్ - సా దేవభాషేతి :- సా లోకప్రసిద్ధా, దేవభాషా సంస్కృతభాషా, అఖిలలోకమాన్యా సర్వజన సమ్మాన్యా. లోకశబ్దస్స జన ఇత్యర్థః. "లోకస్తు భువనే జనే" ఇత్యమరః. తయా ప్రసిద్ధయా గైర్వాణ్యా వాణ్యా, మదూహాం మమ భావనాం, ప్రసాధయామి అలఙ్కరోమి, ఇదానీం సంస్కృతభాషయా కావ్యం కరోమీతి భావః. జనః మానవః, తనుం స్వదేహం, లోకస్య జనస్తోమస్య, హర్షాయ ఆనన్దాయ, నవిద్యతే ఉత్తమా యస్యాః సా అనుత్తమా, సర్వోత్కృష్టేత్యర్థః తయా భూషయా భూషణేన, పరిష్కరోమి అలఙ్కరోమి

లోకే మానవః శ్రేష్ఠాన్యాభరణాని ధృత్వా స్వయం సన్తుష్య పరా నానన్దయతి, ఏవమేవాఽహమప్యద్య గైర్వాణ్యా వాణ్యా కావ్యం విరచ్య లోకా నానన్దపరవశా న్కరోమీతి భావః.

దృష్టాన్తాలఙ్కారః

వృత్తముపజాతిః, సర్గేఽస్మిన్నన్యాన్య ప్యుపజాతి వృత్తాన్యేవ సర్గాన్తే తు మాలినీ వృత్తముపనిబద్ధమ్. వృత్తలక్షణమ్.

"స్యాదిన్ద్రవజ్రా యది తౌ జగౌ గః
ఉపేన్ద్రవజ్రా జతజాస్తతో గౌ,
అనన్తరోదీరిత లక్ష్మభాజౌ

పాదా యదీయా వుపజాతయస్తాః'' ఇతి.
త-త-జ-గణైః గురుద్వయేన చ ఇన్ద్రవజ్రా భవతి.
పాదే యతిః. జ-త జ-గణైః గురుద్వయేన చ
ఉపేన్ద్రవజ్రా భవతి. పాదే యతిః. ఏతయో రవ్యవహిత కథనే
ఉపజాతిర్భవతి.

తాత్పర్యము :- సంస్కృతభాష సుప్రసిద్ధమైనది అదిదేవభాష.
సర్వజన సంపూజిత. కావున నా సంస్కృతభాషచేతనే నా భావము
నలంకరింతును ప్రతిమానవుడును లోకోత్తరములగు నాభరణములను
ధరించి యితరులను సంతోషపరచునుగదా! లోకానందము కొఱకే
యీతారకమను కావ్యమును వ్రాయుచుంటినని కవియాశయము.

2. స్వభావపాణ్డిత్య జలేన కుర్వే
కావ్యం పతత్రీ సహసేవ నీడమ్,
సదోష మప్యుత్తపతే కవిత్వం
యథా కళఙ్కాఙ్కిత మిన్దు బిమ్బమ్,

వ్యా :- స్వభావేతి :- అహమిత్యధ్యాహారః అహం, స్వభావేన
నిసర్గేణ సిద్ధం యత్పాణ్డిత్యం ప్రజ్ఞాపాటవం తస్యబలేన శక్త్యా, సహజ
పాణ్డిత్య ప్రతిభయేతి భావః. కావ్యం తారకాఖ్యం గ్రంథం, పతత్రీ
విహగః, సహసా స్వశక్త్యా. నీడ మివ కులాయ మివ, కుర్వే కరోమి
కావ్యం గన్థః, సదోషమపి కావ్యదోషై రుపేత మపి కలఙ్కాఙ్కితం
అఙ్కసహితం ఇన్దుబిమ్బం యథా చన్ద్రమండల మివ ఉత్తపతే ఉజ్జ్వల
శోభాం కరోతి, ఉద్యోతతే.

యథా పక్షీ స్వశక్తి మనుసృత్య కులాయం నిర్మాతి తథా అహ
మపి సహజపాణ్డిత్య ప్రతిభయా కావ్యం రచయామి. పతత్రిణో నకో
ప్యుపదేష్టాఽస్తి. కిన్తు స్వబుద్ధ్యైవ నీడం నిర్మాతి. అహమపి స్వబుద్ధ్యైవ

సహజపాణ్డిత్యధురీణ ఇతి స్వాతిశయం ప్రకటయతి మహాకవిః. ఉపమాలఙ్కారః.

కలఙ్క దోషదూషితమపి చన్ద్రమండలం యథా పూర్ణిమాయా ముజ్జ్వలతయా ప్రకాశతే తథా కావ్యం దోషజుష్టమపి స్తుష్టు విరాజత ఏవ. మదీయే కావ్యే దోషా న సన్త్యేవ. యది ప్రమాదవశేన దోషః కశ్చిదాపతేచ్చేత్తేన మత్కావ్యస్య నకాచిదపి హాని రితి కవే రాశయః. ఉపమాన గర్భితేన దృష్టాన్తేన పూర్వార్థం సమర్థయామాస.

తా॥ పక్షి సహజమైన తన బుద్ధిశక్తి నాధారముగఁ జేసికొని గూడును నిర్మించును. ఇట్లుకట్టవలె నట్లు కట్టరాదని దానికిఁ జెప్పువా రెవ్వరును లేరు. అట్లె నేనుఁగూడ నాప్రతిభ నాధారముగ నీ కావ్యమును రచించుచున్నాను. దోషములు లేని కావ్యమెల్లప్పుడును రాణించును. అందావంతయును సందియము లేదు ఒకనొకవేళ దోషము లున్నను గావ్యము రాణించును. మచ్చతోనున్నను బున్నమచంద్రుఁడు రాణింపలేదా ?

పెక్కు గుణములున్నప్పు డొక్క దోషమున్నను నాకావ్యము నకుఁ గొఱంత రాదు. "ఏకోహిదోషో గుణసన్నిపాతే నిమజ్జతీన్దోః కిరణే ష్వివాఙ్కః" అను మహాకవి కాళిదాసుని వచనమును సహజముని నిరూపించి కాంతి యెక్కువేయగునని చెప్పి యాతని మించెను.

3. స దేవతాధీన మనః ప్రవృత్తిః
స్వాతన్త్ర్య సఙ్కల్పిత చారుకావ్యః,
దయార్ద్రచిత్తోఽఙ్కిత సత్యవాక్యః
కలాచణ స్సత్కవిరేవ నాన్యః.

వ్యా:- సఇతి :- కవేర్లక్షణ మాహ నిరూపయతి అత్ర తచ్ఛబ్దో యచ్ఛబ్ద మపేక్షతే. యత్తదోర్నిత్య సమ్బన్ధాత్. యః మనుజః దేవతాధీనాం సవశ్యత్వాదీనాం. -ధీనా ఆయత్తా, మనసః ప్రవృ

_త్తిః మనోవ్యాపారః యస్య సః, స్వాతన్త్ర్యేణ స్వేచ్ఛయా, సఙ్కల్పిత మభ్యూహితం, చారు మనోహరం, కావ్యం గ్రన్థః యస్యసః, దయయా కరుణయా, ఆర్ద్రం స్విన్నం చిత్తం మనః యస్యసః, అక్ష్వేతం అలఙ్కృతం, సత్యవాక్యం సత్యవచనం యస్య సః, కలాభిః విద్యాభిః చతుష్షష్టి కలాభిర్వా, విత్తః సమర్థః కలాచణః, "తేన విత్తశ్చుఞ్చుప్చణపౌ" ఇతి పాణినిః. సఏవ సత్కవిః, సఏవ వోత్తమకవిః, అన్యః పూర్వోక్తలక్షణ విహీనః, న, సత్కవిర్న భవతి.

ఆరాధితదేవతామూర్తిః స్వతంత్రప్రతిభా సమన్వితః దయాలుః సత్యవచనః సకలవిద్యావిశారదః మానవ ఏవ సత్కవిర్భవితు మర్హతి. నాన్యఇతి కవే రాశయః ఏతేన సత్కవిలక్షణం సర్వమపి స్వస్మిన్నస్తీతి సూచితమ్.

తా॥ ఎవ్వఁడు నిత్యము దేవతల నారాధించునో, యెవ్వఁడు స్వతంత్రముగ నూహింప శక్తిగలిగియుండునో, యెవ్వఁడు కరుణార్ద్ర హృదయుఁడో, యెవఁడు నిత్యసత్యవచనుఁడో, యెవ్వఁడు సకలకలా పరిపూర్ణుఁడో, వాఁడే సత్కవియగును. ఏతల్లక్షణ విరహితుఁ డేనాఁడును సత్కవి కానేరఁడు. దీనినిఁ బట్టి యీ లక్షణములన్నియుఁ దన యందున్నట్లు సూచింపఁబడెను.

4. విన్ధ్యప్రదేశే క్వచిదస్తి చఞ్చ
న్నదీతటే సంశ్రితకల్పనామా,
గ్రామః పురా తత్ర మహేశ్వరాఖ్య
స్తపోధనో బ్రాహ్మణరాడవాత్సీత్.

వ్యా :- విన్ధ్యప్రదేశ ఇతి :- పురా పూర్వకాలే, విన్ధ్యస్య విన్ధ్యనామ్నః పర్వతస్య ప్రదేశే స్థలే, విన్ధ్యపర్వత ప్రాన్తదేశ ఇత్యర్థః, చఞ్చన్నామ్నీ నదీ కాచన సరిత్, తస్యాఃతటే తీరే, క్వచిత్ కుత్రచిద్భాగే, సంశ్రితానాం ఆశ్రితానాం జనానాం కల్పతరు రితి గ్రామః

సంవసథః అ స్తి, తత్ర తస్మిన్గ్రామే, తప ఏవధనం వి త్తం యస్యసః తపస్వీ, మహేశ్వర ఇతి ఆఖ్యా నామధేయం యస్యసః, "ఆఖ్యాహ్వే అభిధానంచ నామధేయంచ నామచ" ఇత్యమరః. బ్రాహ్మణానాం రాట్ రాజా, బ్రాహ్మణ ప్రభురిత్యర్థః. అవాత్సీత్ ఉవాస, వస నివాసే ఇతి ధాతో ర్లుజ్.

పురా విన్ధ్యపర్వత ప్రదేశే చఞ్చన్నదీతీరే సంశ్రితకల్ప ఇతి నామ్నా ప్రసిద్ధః కశ్చి ద్గ్రామ ఆసీత్. తత్ర తపోధనో మహేశ్వ రాఖ్యః బ్రాహ్మణ ప్రభు రువాస.

తా॥ వింధ్యపర్వత ప్రాంతమునఁ జంచన్నది యను పేర నొకనది కలదు. దానియొడ్డున నొకచోట సంశ్రితకల్పమను పేరుగల గ్రామ మున్నది. అందుఁ దపోధనుఁడైన మహేశ్వరుఁడను బ్రాహ్మణ ప్రభువు సించుచుండెను.

5. యథార్థవా క్సన్నుత దివ్యతేజా
నక్తం దివం పూజిత దేవ దేవః,
పౌరాణికః పూతయశా వదాన్య
స్స దేవభాషా నిపుణః కవీన్ద్రః.

వ్యా :- యథార్థేతి :- సః మహేశ్వరః, యథార్థవాక్ యథా తథవచనః, సత్యవాదీత్యర్థః. సన్నుతం సద్భిః స్తుతం దివ్య ము త్తమం తేజః మహిమా యస్యసః, సజ్జన స్తుతమహిమేత్యర్థః. న క్తంచ దివాచ న క్తం దివం అహర్నిశం, "అచతుర విచతురేత్యాదినా అ ప్రత్య యాన్తో నిపాతః, పూజితః ఆరాధితః దేవదేవో మహాదేవో యేన సః, స న్తతశివారాధన తత్పర ఇత్యర్థః, పౌరాణికః పురాణ ప్రవచపటుః, "పురాణం వే త్తి అధీతే వేత్యర్థః. "ఆఖ్యానాఖ్యాయి కేతిహాస పురాణే భ్యశ్చ" ఇతిఠక్ ప్రత్యయః. పూతం పవిత్రం యశః కీ ర్తిః యస్యసః, పుణ్యశ్లోక ఇత్యర్థః. వదాన్యః దాతా, వితరణశీల ఇత్యర్థః. దేవభాషా యాం అమరభారత్యాం, నిపుణః కుశలః, కవీన్ద్రః కవిశ్రేష్ఠః అభూత్.

తా॥ ఆ మహేశ్వర పండితుఁడు నిత్యసత్యవచనుఁడు సజ్జన సంస్తుత మహిమోపేతుఁడు. సంతత శివారాధన తత్పరుఁడు, షట్కర్మములను చక్కగఁబురాణ ములనెఱిఁగి ప్రవచించు శక్తికలవాఁడు మంచిదాత, పుణ్యకీర్తి సంస్కృత భాషలో నిష్ణాతుఁడు, కవులలో శ్రేష్ఠుఁడు.

6. ముదా యథాశక్త్యతిథీ నతర్పీత్
సదాఽత్మ శిష్యా నశిష త్స్వధర్మమ్
వ్యవీవృత ద్రాగపథా ద్విమూఢాన్
స పణ్డిత స్సాధుజనా నభాక్షీత్.

వ్యా :- ముదేతి :- సః- పణ్డితః సుధీర్మహేశ్వరః యథాశక్తి శక్తిమనతిక్రమ్య, ముదా ప్రీత్యా, అతిథీ నాగన్తూన్ అతర్పీత్ అన్న దానాదినా తృప్తానకార్షీత్. "తృప ప్రీణనే" ఇతిధాతోర్లుఙ్, ప్రీణనం తృప్తిః తర్పణాచ,సదా సన్తతం ఆత్మశిష్యాన్ స్వచ్ఛాత్రాన్,స్వధర్మం ఆత్మధర్మం అశిషత్ ఉపదిదేశ శాసు అనుశిష్టౌ ఇతిధాతోర్లుఙ్ "సర్తి శాస్త్ర్యర్తిభ్యశ్చ" ఇతి అఙ్, శాస ఇదఙ్హలో రితీత్వమ్. శాసివసిఘసీనాంచ ఇతి షత్వంచ, విమూఢాన్ మోహాత్మకాన్, అజ్ఞానావృతచిత్తానిత్యర్థః రాగపథాత్ రాగద్వేషాది దుష్టప్రవృత్తిమార్గాత్ వ్యవీవృతత్, నివర్తయామాస,నిపూర్వక వృతువర్తనే ఇతిధాతోర్ణిచిలుఙ్. సాధుజనాన్ సత్పురుషాన్ అభాక్షీత్ అభజత. అసేవతేత్యర్థః, భజ సేవాయామితి ధాతోర్లుఙ్.

తా॥ ఆ మహేశ్వర పండితుఁడు తన శక్తికొలఁది అతిథుల నాదరించి సంతృప్తులఁ గావించుచుండెను, తన శిష్యుల కాత్మధర్మముల నుపదేశించుచుండెను, మూఢులను రాగద్వేషాది దుష్ప్రవృత్తులనుండి మరలించుచుండెను, సజ్జనుల నభిమానించి సేవించుచుండెను,

7. బాల్యం గురో రధ్యయనేన తస్య
స్వభార్యయా యౌవన మిద్ధకీర్తేః.
అనాయి పద్మాప్రహ్మణ శేఖరస్య
వృద్ధత్వ మస్తం తపసా సమస్తమ్,

వ్యా :- బాల్యమితి:- ఇద్ధా ప్రకాశమానా కీర్తిః యశః యస్య తస్య, ప్రసిద్ధ యశస ఇత్యర్థః. సద్బ్రాహ్మణ శేఖరస్య బ్రాహ్మణోత్తమ శిరోమణేః తస్య, మహేశ్వరస్య, సమస్తం బాల్యం వయః సర్వం బాల్య రూపం వయః, గురోః ఆచార్యస్య సకాశాత్ అధ్యయనేన విద్యాభ్యా సేన, సమస్తం యౌవనం వయః, సర్వం తారుణ్యరూపం వయః, స్వభార్యయా స్వకలత్రేణ, సమస్తం వృద్ధత్వం వయః, సర్వం వార్ధక రూపం వయః, తపసా తపోఽనుష్ఠానేన, అన్తమనాయి అన్తమనీయత, నీ ప్రాపణే ఇతి ధాతోః కర్మణి లుజ్.

స మహేశ్వర పణ్డితః విద్యాభ్యసనేన సర్వం బాల్యం, స్వభార్యా సుఖానుభవేన సర్వం యౌవనం, తపోఽనుష్ఠానేన సర్వం వార్ధకం వయశ్చ అన్తమనైషీత్.

తా॥ ఆ మహేశ్వర పండితుడు, గురువులకడ విద్యాభ్యాసము చేతనే బాల్యమును గడపెను. తన భార్యవలన సుఖముల ననుభవించుచు యౌవనమునంతను దాటించెను. తపమును గావించుకొనుచు ముసలి తనమును వెళ్ళించెను. తన వయస్సునంత నతఁడీ తీరున గడపెను.

8, తం తస్య పత్నీ సుదతీ ప్రశాన్తా
మహాకులీనా కమనీయనేత్రా
సమ్పూర్ణ జైవాతృక బిమ్బవక్త్రా
శతహ్రదా మేఘ మివాన్వసార్షీత్.

వ్యా :- తమితి :- శోభనాఃదన్తాః యస్యాస్సా సుదతీ, తరుణీ త్యర్థః "వయసి దన్తస్యదతృ" ఇత్యనేన బహువ్రీహౌ దన్తశబ్దస్య దత్రా దేశః, ప్రశాన్తా శాన్తస్వభావా, మహాకులీనా ఉత్తమవంశసఞ్జాతా, కమనీయనేత్రా సున్దరనయనా, సమ్పూర్ణం యత్ జైవాతృకస్య చన్ద్రస్య బిమ్బం మణ్డలం తద్వత్ వక్త్రం ముఖం యస్యాస్సా, "ఇజ్జో జైవాతృకస్సోమ" ఇత్యమరః. తస్య మహేశ్వరస్య పత్నీ భార్యా, శతహ్రదా విద్యుత్, "శమ్పాశతహ్రదా హ్రాదినీ"త్యమరః మేఘమివ

అమ్బుద మివ, తం పతిం మహేశ్వరం అన్వసార్షీత్ అనుససార. అను పూర్వకస్య సృ గతావితి ధాతోర్లుజ్. ఉపమాలఙ్కారః.

యథా విద్యుదమ్బుదమనుసరతి తథా సా సుదతీ స్వభర్తార మనుససారేతి భావః.

తా॥ ఆ మహేశ్వర పండితుని భార్య మిక్కిలి చక్కనిది. చక్కని పలువరుసగల యువతి. శాంతస్వభావ. సత్కులమున జన్మించి నది. అందమైన కన్నులతోఁ బున్నమచందురుని వంటి మోముతో నొప్పుచు నామె మేఘమునను సరించి మెఱుపుతీఁగ యున్నట్లు, నిత్యము తనపతి ననుసరించియే యుండును.

9. భర్త్రా యథా సా కథితం పురాణం
శ్రుత్వాఽశకన్మఙ్క్షు తథైవ వక్తుమ్
ప్రశస్త బుద్ధి స్తపనీయ గాత్రా
ప్రియంవదా సజ్జన కీర్తనీయా.

వ్యా :- భర్త్రేతి :- ప్రశస్తా శ్లాఘ్యా బుద్ధిః మతిః యస్యాస్సా, సూక్ష్మబుద్ధిరిత్యర్థః. తపనీయం కాఞ్చన మివ గాత్రం శరీరం యస్యాస్సా, కనకాంగీ త్యర్థః "తపనీయం జాతరూపం గాఙ్గేయం భర్మకర్బుర" మిత్య మరః. ప్రియంవదతీతి ప్రియంవదా మధురభాషిణీ, సజ్జనైః సత్పురుషైః కీర్తనీయా, స్తవనీయా, సా మహేశ్వరపత్నీ, భర్త్రా స్వపతినా యథా యద్వత్, కథితం ఉక్తం, పురాణం శ్రుత్వా తథైవ, మఙ్క్షు ద్రాక్, వక్తుం కథితుం, అశకత్ సమర్థా అభవత్, శక మర్షణ ఇతిధాతోః పుషాదిత్వాత్, పుషాదిద్యుతా దీత్యాదినా అఙ్. అథవా శక్లృశక్తౌ ఇత్యస్మాద్గణపఠితాత్ లుఙ్, ఇదిత్వాదఙ్

సా మహేశ్వరపత్నీ స్వభర్త్రా కథితం పురాణం శ్రుత్వా యథా భర్తా అకథయత్ తథైవ పునః శీఘ్రం వక్తుం సమర్థా బభూవ ఏతేనాస్యా స్సూక్ష్మ బుద్ధిత్వం సూచ్యతే.

తా॥ ఆ మహేశ్వర పండితుని భార్య మంచి బుద్ధిమంతురాలు, బంగారువంటి దేహచ్ఛాయగలది. ప్రియంవద. సత్పురుషులామె యోగ్యతను గొనియాడుచుందురు. ఆమె తనభర్త చెప్పు పురాణ ప్రవచనమును విని, యట్లే మరల నా పురాణము నతివేగముగఁ జెప్పుచుండును. ఆమె సూక్ష్మగ్రాహిణి.

10. తౌ దమ్పతీ నిర్మలశీలయుక్తౌ
ప్రవృద్ధ సన్తాన యశో విశాలౌ,
సుఖేషు దుఃఖేషు సమానచిత్తౌ
వభ్రాజ తాభ్యాం ధరణీ చిరాయ.

వ్యా:- తావితి :- తౌ దమ్పతీ జాయాపతీ, నిర్మలేన రాగద్వేషాదిమలశూన్యేన శీలేన స్వభావేన, యుక్తౌ సహితౌ, ప్రవృద్ధాభ్యాం సన్తాన యశోభ్యాం అపత్యకీర్తిభ్యాం విశాలౌ పరిపూర్ణౌ, సుఖేషు దుఃఖేషు సుఖదుఃఖాద్యవస్థాసు సమానం తుల్యం చిత్తంస్వాన్తం యయోస్తౌ, తుల్యశీలా విత్యర్థః. ఆస్తామ్. తాభ్యాం తాదృశ దమ్పతీభ్యాం, ధరణీ ధరిత్రీ, చిరాయ చిరంకాలం, "చిరాయ, చిరరాత్రాయ చిరస్యాద్యాశ్చిరార్థకాః" ఇత్యమరః అభ్రాజి ప్రకాశితాబభూవ. తౌ చిరంతస్థతు రితి భావః.

తా॥ ఆ భార్యాభర్త లిరువురును నిర్మలచిత్తులు. వారి సంతానమును వారి కీర్తియును దినదినాభివృద్ధి నందుచుండెను. వారిరువురును సుఖదుఃఖాద్యవస్థలందేకచిత్తులై మెలఁగుచుండిరి. వారిచేఁ జిరకాలము భూమి యలంకరింపఁబడెను. చిరకాలము భూమండలమున కలంకారముగ వారు జీవించిరని భావము.

11. పుణ్యాత్మనో స్సద్గృహిణో స్తయోరు
తభూత్కనిష్ఠః పరదేవతాంశః,

